# వసంతము

రచన:

బద్దెపూడి రాధాకృష్ణమూర్తి, బి. ఏ., బి. ఎల్.,

అడ్వొకేటు, గుంటూరు.

వెల రూ. **1-0-0**

ప్రకాశకులు:

కల్చరల్ బుక్స్ లిమిటెడ్,

మద్రాసు-2.

# 1

"దీపా! దీపా!"

సమాధానము రాలేదు.

"ఏమి, రాణిగారు పలుకుటే కష్టమైనది! తీరుబడి లేనంతగ పని యున్నదేమో!"

"అబ్బ! చాలులెండి, మీ వెక్కిరింపులు, వేళాకోళములును. ముందు రాణి, పైని గారుకూడనా? నాకెందుల కిన్ని రకముల సంబోధనలు? అన్నియుఁగలవారి కవి అందము గాని, నాకేమి అందము? ఇంతకును మీరు పిలిచిన పని చెప్పక పోతిరి?"

"దీపా! నీవు నాయింటికి మణిదీపమువంటిదానవు. కాని..."

"కాని-అని ఆఁగితిరేమి? విషయమేమియో పూర్తిగ చెప్పరేల?"

"చెప్పుట కేమున్నది? అంతయు మామూలే. నీ మనసు నే నెఱుఁగకపోలేదు. దేవుని యనుగ్రహము కల్గినఁ గాని మన కొఱఁత తీరదు. ఆనాఁడుగాని మనకు సంతోషము కలుగదు. అట్లని, అంతవరకు దినదినము చింతపడుచున్న నేమి లాభము?"

"లాభమో, నష్టమో నాకు తెలియదు. ఒక నాటి కైన నా యదృష్టము మారునని-మంచిరోజులు వచ్చునని

నాకు నమ్మకము లేదు. అచ్చట్లు ముచ్చట్లతో అందచందాల బిడ్డల నెత్తుకొని యిరుగు పొరుగులయిల్లాండ్రవలె నుండ నోఁచుకొనకపోతినిగదా అనియే నా యాలోచన. కొఱనోములు నోఁచిన నాకు ఎక్కువ ఫలితము లెట్లుకలుగును లెండు!”

“అనవసరముగ విచారముపొందుట నీ కలవాటైనది. ఎడ తెగని యాలోచనతో, అంతులేని ఆవేదనతో కృశించుట తగదు. ఎల్లప్పుడు నుల్లాసముగ నున్నచో మనస్సునకేగాక శరీరమునకుఁగూడ ఆరోగ్యము హెచ్చును. అదియే ఆనందము, ఐశ్వర్యమును. పిచ్చిదానా! లోకము విషయము చూచుచుంటివిగాని, సూక్ష్మములను గ్రహింపకుంటివి. లోకములోనే కొఱఁతయు లేనివా రెవరుందురు? ఏదియో లోపముండెనని, దానికై వగచుచు, సౌఖ్యజీవితమునకు చేసేతుల అడ్డంకులఁ గల్పించుకొనుట వెఱ్ఱితనము. కొఱఁతలను గాని, కష్టములనుగాని మఱచి జీవితమును సుఖప్రదము చేసికొనుట మానవుల విధి. అది మానవ విజ్ఞానమునకు గొప్ప తార్కాణము.”

“మీరేమేమియో అందిక పొందిక లేని విషయములను చెప్పి నాధోరణిని తప్పింపఁజూచుచున్నారు. నిజమునకు...”

“నిజమునకే. నేను చెప్పునదంతయు నిజమే. సామాన్య విషయములలోనేగాక నిజమునకు ప్రకృతిలోఁగూడ ఇట్టి చిత్రము లున్నవి. తెల్లని జాబిల్లికి నల్లనిమచ్చ లోపమేనా?

చక్కని గులాబికి ముండ్లెందుకు? కోయిల కంఠము కమ్మఁదనమునకు సరిపడిన రూపము లేదని యొప్పుకొందువా? ఇవి యన్నియు లోపములు కావందువా? అట్లని, చంద్రుఁడు చల్లని వెన్నెలను వెదచల్లుట వీడెనా? గులాబి కమ్మతావులు విరజిమ్ముట విడిచెనా? కోయిల మధురగీతలు పాడుట మానుకొనెనా?''

''బాగున్నదిలెండి, మీ యుపన్యాసము! పిలిచిన విషయము చెప్పుట విడిచి, కవిత్వధోరణి మొదలు పెట్టు చున్నారు!''

''కవిత్వధోరణి మొదలు పెట్టు టేమిటి? నీ నగు మోముఁ జూచినపుడొక మహాకావ్యమునే చెప్పఁగలను. చదువుకొనినదానవు, సరసురాలవు. నీ సరసను...''

''మంచిది, మంచిది. ఈ 'పొగడికోలు అధ్యాయము' ఇంక చాలులెండి. ఇంతకును అహ్మదునగర ప్రయాణము నెపుడని నిశ్చయించితిరి?''

''అదిగో, అపుడే గ్రహించితివి. నేను చెప్పఁదలఁచిన విషయముకూడ నిదియే. నేను చెప్పునది కావ్యమంటివే; కావ్యమునకు 'తొలిపలుకునావంతు' అనియా యీసూచన?''

''సరి, ఇంతకును మీ ధోరణిని విడువరా యేమి?''

''నేను నా ధోరణిని విడచుచున్నాను, మనము దౌలతాబాదును విడుచుట మాత్రము నిశ్చయమైనది. అహ్మదునగరమున మన నివాసమునకు వలయు నేర్పాటుల

నన్నింటిని పూర్తిచేసితిని.''

''ఏర్పాటులన్నియు పూర్తియైనచో ఇఁక అడ్డంకి యేమి?''

''అడ్డంకి యేమియు లేదు. రాణిగారి యంగీకార ముద్రయే తరువాయి.''

''ఓహో! ఆలాగుననా? రాణిపదవి నిచ్చితిరి; మఱి ముద్రఁగూడ చేయించితిరా? మీరు కోరినట్లు ఫర్మానా వ్రాయించి, ముద్ర వేయించి యిత్తును.''

''అవశ్య మటులే. నీయాజ్ఞను తప్పఁగలనా? ఇంకొక విశేషమును గలదు. మామూలు రాణియైనచో ఆమె చెప్పిన తరువాతఁగాని పనులు జరుగవు. మఱి నీవిషయమున నేమి జరిగినదో యూహించితివా? నీవు రాణిపట్టము గట్టుకొనక ముందే-'మూఁడు ముడులు' పడకముందే-ముద్ర చేయించితిని. నీ నోట మాటరాకముందే, నీ కనుసన్నయైన తిన్నగ కలుగకముందే, నీ చేయిపట్టి, పట్టముగట్టి, ముద్రకై ముచ్చటైనయుంగరముఁ బెట్టితిని. ఇదిగో, ఇదియేసాక్ష్యము,'' అని మెల్లగ నవ్వుచు మల్లాజీ యామె యుంగరమును చూపు నెపమున భార్య యగు దీపాబాయిహస్తము నంటెను. 'ఔను లెండు' అన్నట్లు దీపాబాయి ముఖము వికసించెను.

---

# 2

మల్లాజీ భోన్‌స్లా వివేకి. మాటచతురత గలవాఁడు. ఉన్నతాభిప్రాయము లతని కుగ్గుతో పెట్టినవి. పనిని సాధించు పట్టుదల యతనికి స్వభావమైనది. ఎవరికైన నెట్టి విషయము నన్నైన అతఁడు ముచ్చటగ నచ్చఁజెప్పఁగలఁడు. కష్టమున నోర్పు, గట్టిచిక్కులలో నేర్పు నతనికి పెట్టని సొమ్ములు.

మల్లాజీ భార్య దీపాబాయి అందకత్తె; అనుకూల సతి. ఆమె నింబలవంశీయుఁడగు రావునాయకుని సోదరి. ఆమె పుట్టినిల్లు, మెట్టినిల్లు సంపన్నములు. వంశగౌరవమునకు, విద్యకు వన్నెఁబెట్టిన కుటుంబములు.

ఆ కాలమున అహ్మదునగరరాజ్యము ప్రసిద్ధ రాజ్యములలో నొకటి. అహ్మదునగర సుల్తానులు గుణవంతులను మెచ్చువారు, మెచ్చినవారికి తృప్తినిచ్చువారు నని ప్రతీతి.

దౌలతాబాదు కాఁపురముపై మల్లాజీకి మనసు విఱిగెను. అతఁడు కాఁపురమును లచ్చి కాఁపురమగు అహ్మదు నగరమునకు మార్ప నిశ్చయించుకొనెను. నివాసమునకు వల సిన వసతుల నన్నిటి నేర్పరచుకొని అహ్మదునగర ప్రయాణ మునుగూర్చి భార్యతో ప్రస్తావించెను. అహ్మదునగరమున అందల మెక్కఁదగిన యదృష్టము కలుగకపోదని లోలోన తీయని తలఁపుతీగలు పెంచుకొనుచున్న ఆ యాలు మగ లీ విషయమునను 'దేహములు రెండు ; కాని ఆత్మ ఒకటే'

అన్న మాటకు నీటుగొల్పిరి.

మల్లాజీ నివాసము మారుచున్నాఁడనువార్త క్షణములో ఱెక్కలు గట్టుకొని యూరేఁగినది.

"మల్లాజీ మంచి చెలిమికాఁడు. మాణిక్యమువంటి వాఁడు. మనయూరు వదలిపోవునఁట!"

"గొప్పపదవులు కోరుకొనుచున్న మల్లాజీ మఱి మన యూరిలో నింకను ఉండునా?"

"ఇక్కడ ఏమిలోటు కల్గినది? ఏమి, మన దాలతాబాదు మాత్ర మేవిషయములో తీసిపోఁగలదు?"

"లేని వెఱ్ఱిగాని, గొప్పపదవి కావలెనని కోరినచో నిక్కడ మాత్రము దొరకదా యేమి?"

"చిలుక-గోరువంకలవలె చూడ ముచ్చటైన జంట. మన యూరు విడిచి వెళ్లుట మనకుఁగూడ కష్టమే!"

"వెళ్ళఁదలఁచినవారు వెళ్ళవచ్చు; ఉండఁదలఁచిన వారు ఉండవచ్చు. ఇందులో నిమిడిన బ్రహ్మాండమేమి యున్నది, ఇంతగ చెప్పుకొనుటకు?"

"మంచివారిని మంచి అనుట, చెడ్డవారిని చెడ్డ అనుట లోకము పుట్టినపుడే పుట్టిన సంగతి. మల్లాజీ మంచితనమునకు మెఱుఁగుఁబెట్టు మెలఁకువ దీపాబాయిలో నున్నది. ఆ యిల్లాలి యనుకూలత అతనికి పాగా పెట్టినది."

"ఇన్నాళ్లును లేని యాలోచన మల్లాజీకి ఇపుడెందుకు కల్గినదో?"

"ఏమో, మల్లాజీ ప్రయాణ మతని యదృష్టమున కెదురునడక కాదుకదా?"

"భల్లూకపుపట్టుఁ బట్టు మల్లాజీ యెక్కడనైనను జయింపఁగలఁడు. అతని ప్రయాణమునుగూర్చి యనుమాన మెందుకు?"

"దీపాబాయి-మల్లాజీ అహ్మదునగర ప్రయాణము నకు 'మూట-ముల్లె' సర్దుచున్నారఁట. దీనికిఁ గారణ మమ్మగారి ప్రోద్బలమా? అయ్యగారి ప్రోత్సాహమా?"

"'క్రొత్త వింత-ప్రాతఁరోత'-అన్నట్లు అహ్మదు నగరపు టందచందము లాకర్షించినవి కాఁబోలు! మల్లాజీ మకాము మార్చుచున్నాఁడఁట!"

"దీపాబాయి! మల్లాజీ! ! ఊరిలో నెందరులేరు వారి వంటివారు? ఎవరికి కావలె, వారి రాకడ-పోకడలు? 'ఎవరికి వారే-యమునా తీరే.'"

అని ఊరిలోని పలువురు, తలకొకపలుకు పలికిరి.

హితులు పెక్కురు ప్రయాణపువేళ ఆ యాలు మగలఁ జూచి మాటాడ వచ్చిరి.

"మనుష్యులు దూరమైనను, మనసులు దూరము కానీయకుఁడు సుఁడీ!"

"క్రొత్త యూరు చేరినను, ప్రాఁత స్నేహితులను మఱువకుఁడు."

"మన యూరని మఱల నప్పుడప్పుడువచ్చి వెళ్లు

చుండుఁడు!''

''ఎక్కడనైనను సుఖముగ నుండుటే మాకు పదివేలు.''

''మంచిది. క్షేమముగాఁబోయి, లాభముతోరండు.''

''వెళ్ళి వత్తుము.''

''ఇఁక సెలవా?'' అని చూడవచ్చినవారి పరామర్శలు, వీడ్కోలు పలుకులు ముగిసినవి. ప్రయాణము సాఁగినది.

# 3

''షా, షా, ఓహోహో! ఎందుకోయి యీ నవ్వులు-ఈ కిలకిలలు? ఏమి కావలెను? నీవు, నీ బోసి నోరును-ఎంత చక్కగ ఉన్నావు! నా చిట్టి తండ్రీ! నా బంగారు మొలక...''

''నా వరాలమూటకూడ,'' అనుచు మల్లాజీ కొడుకు నాడించుచున్న దీపాబాయిని చేరవచ్చెను.

''చూచితిరా-మీరు వచ్చుసరికి కేరింతలు మాని పెద్ద మనుష్యునివలె ఉన్నాఁడు!''

''ఔను, మఱి. తండ్రిమీఁద గౌరవముఁ జూపుట నిపుడే తెలిసికొన్నాఁడు.''

''కాదు, కాదు. నేననిన ఎక్కువ సరదా.''

"కావచ్చును. కాని, నేననిన ఎక్కువగౌరవము."

షాజీ తన యూయెలకు రెండువైపుల నిల్చిన తలి దండ్రులఁజూచి మఱల కేరింతలు మొదలుపెట్టెను.

దీపా: అమ్మకచెల్ల! ఎంత గడుసరివిరా!

మల్లా: చూచితివిగా–ఇంతలోనే తెలిసినది, ఇద్దఱు నొకటే అని. అందుకొఱకే యీ నవ్వు!

దీపా: బుడుతఁడు వ్రేలెడైనను, బుద్ధి పుట్టెఁడున్నదిలెండు. మగవాఁడు కాఁబట్టి తండ్రి పక్షమైనాఁడు; అదిగో, మీ పక్షమే అన్నట్లు బోసినవ్వులు వెళ్ళఁబోయు చున్నాఁడు. ఏమోయి! చందమామను వెక్కి రించుచున్నావా?

మల్లా: చందమామనే కాదు. అందమైనవారము అనుకొను వారిని అందఱను వెక్కిరించుచున్నాఁడు.

దీపా: కావచ్చును, మీ గుణమే వచ్చినది కాఁబోలు!

మల్లా: కాక?

దీపా: కాక! లేక! చివఱకు మీరే ఏకము.

మల్లా: ఇంటిపని నంతయు వంటలక్కకు అప్పగించి, రోజం తయు దగ్గఱఁ గూర్చుండి నీ వెంత నూఱిపోసినను నా గుణముకాక నీ గుణము వచ్చునా?

దీపా: వచ్చెడువాని మాటకాదు, వచ్చినవాని మాట– నేను చెప్పుచున్నది. ఇంతకు నేను నూఱునది, పోయు నది–వస, ఉగ్గు. గుణములను నూఱిపోయువలసిన

యవసరమేమున్నది? భోన్‌స్లాలలో 'నోట వ్రేలుంచిన కొఱకలేని వారు' ఎవరున్నారని మన షాజీకి గుణ ములు నేర్పవలసి యుండును? అదుగో, చూడుఁడు. అంతయు నర్థమగుచున్నట్లు కన్నులు త్రిప్పుచున్నాఁడు! నా చిట్టితండ్రి నవ్విన నవ రత్నాలు రాలును.

మల్లా: అన్నియు నీకే కాఁబోలు?

దీపా: కొన్ని మీకుఁగూడ. ఇవిగో, తీసికొనండి, మీ భాగము—అనుచు బాలుని యూయెలను కదిపి మల్లాజీ వైపు త్రోసెను.

"మఱి నీ వంతు తీసికో—"అనుచు మల్లాజీ యూయెలను దీపాబాయివైపునకు తిరిగి త్రోసెను.

"మీ పక్షమువానితో నాకేమిలెండి—"అని నవ్వుచు దీపా బాయి యుయ్యాలను మఱల త్రోసెను.

"కాదు, నీ పక్షమేనఁట—"అని నవ్వుచు మల్లాజీ యూయెలను తిరిగి త్రోసెను.

ఇటులా దంపతులు సరసముగ, సంతోషముగ సంభా షించుచు తమ ముద్దుబిడ్డని యూయెల నూచసాఁగిరి. రెండు పక్షములు తనకొకటియే అన్నట్లు అందు షాజీ హాయిగ నిద్రించెను.

"షా మీ పక్షమో, నా పక్షమో తరువాత తేల్చు కొందము; ముందుగ నతఁడు శుక్లపక్షపు చంద్రుఁడని ఒప్పు

కొందురుకదా?''-అనుచు దీపాబాయి మల్లాజీపై చిఱునగ వులంజిందెను.

# 4

''వెన్నెలరోజులు వచ్చినట్లే. రాకపోవు. పనులు కాకపోవు. కాని, యింకను మబ్బుతెరలుమాత్రముపూర్తిగ విడువలేదు. విడువకపోవు. ఏమైనను ప్రభుత్వపు కొలువులోఁ జేరవలెను. అన్నట్లు, సుల్తాను దర్శనము సులభమైనను, ప్రభుత్వోద్యోగము మాత్రము సులభముగ లభించదు కదా? ఎంతటివారికో కాని అది సాధ్యముకాదని వినికిడి. ఎంత వెట్టిని! ప్రయత్నింపకయే పనికాదని నిరుత్సాహముఁ జెంద నేల? విఘ్నములు కలుగునని, పనులు విఫలము లగునని శంకించి ప్రయత్నములను ముందుగనే విడుచుట ఎంత యవివేకము? ఆత్మవిశ్వాసములేనివాని కన్నియు ననుమానములే; అన్నిటికి నంతరాయములే. అట్లని, ఏమో-'అందనిమ్రాని పండ్లకట్టులు చాచుట' వివేకముకాదు కదా?...ఏమీ, అందని మ్రాని పండ్లేమి? విద్యావంతుడను; ఉన్నత వంశజుఁడను; వ్యవహార దక్షత లేనివాఁడను కాను; కాసు కాసపడి కాని పనులను చేయువాఁడనుకాను...నన్ను నేనే పొగడు కొనుటయా? కూడదు; కూడదు. నా శక్తిఁజూపి ప్రభువును

మెప్పించవలయును. సాటియుద్యోగుల పొగడ్త లందవలెను. ప్రజల యభిమానమును చూఱఁగొనవలెను...బాగున్నది? ఇంతలో నెంతదూరము పోతిని! ఎందు కీ గాలిమేడలు? కాదు, కాదు. గాలిమేడలు కావు; కారాదు. గాలిమేడలు కట్టుట భోన్స్లా వంశీయులకు తెలియని పని. ఇది నిశ్చయము. నా గౌరవమునకు వన్నె తెచ్చు ప్రభుత్వోద్యోగము వచ్చి తీరును. నేఁడు కాకున్న రేపు. కాని రోజు మల్లాజీ కాని రోజు''–అని మల్లాజీ యొకనాఁటి సాయంకాలము తన భవనమున పడకకుర్చీలోఁ గూర్చుండి తనలో ననుకొనుచుండెను. అంతలో నౌకరు గణేశ్ వచ్చి యతనిని దర్శించుటకొక పెద్దమనుష్యుఁడు వచ్చి వేచియుండెనని చెప్పెను. ''ఆయనను లోనికి రమ్మనుము'' అని మల్లాజీ పల్కెను. పెద్ద మనుష్యుఁడు లోనికి వచ్చెను.

మల్లా: ఓహో, దిగంబరరావుజీయా! రా. కూర్చుండుము.

దిగం: ఏమి, మల్లాజీ! ఏదియో దీర్ఘముగ నాలోచించుచున్నట్లున్నావు? నాతో చెప్పఁదగని విషయము కాదుకదా?

మల్లా: మిత్రుఁడవగు నీకు చెప్పక దాఁచవలసినదేమైన నుండునా?

దిగం: అట్లయిన వినఁగోరెదను.

మల్లా: వినిన మాత్రమున మిత్రుఁడవగు నీ విధి తీరునను కొనకుము. అవసరమైన సలహా నిచ్చి సాయము

చేయుదు ననుము.

దిగం: నాతో నేఁడేమో క్రొత్త మనుష్యునితోవలె మాట లాడుచున్నావు! నేను సాయము చేయఁగల విషయ మైనచో, సాయము చేయుదునని నాచేఁ జెప్పింపఁ గోరుటకంటె, ఆ పని చేయుమని స్నేహభావమున నన్నాజ్ఞాపించుటకు నీకు హక్కు లేదా? ఇంతకాలము నుండి నన్నెఱిఁగియు, ఇంతగ సంశయింప నేల?

మల్లా: నిజము, దిగంబరరావుజీ! నిజము. ఏదియో అల వాటుచొప్పున నిట్లంటిని. కాని, నీ గుణము తెలి యక కాదు.

దిగం: మల్లాజీ! అవసరములు కలుగుట యందఱకును సహ జము. స్నేహములో ఒకరికొకరము సాయముచేసి కొనుటగూడ సహజమే! సహజమే అననేల? అది మన ధర్మము. స్నేహమనునది పవిత్రమైన సంబం ధము. అంతస్తులతో-ఆస్తిపాస్తులతో - కుల గోత్ర ములతో దీనికి పనిలేదు. చుట్టఱికమునందుకంటె స్నేహమునందు గొప్ప విశిష్టత, ఎక్కువ అన్యోన్యత- ప్రేమ-అభిమానము లుండును. మిత్రునికై ప్రాణమైన నిచ్చుట మనకు సంప్రదాయము. తనపై తనకెట్టి స్వాతంత్రత, అధికారము నుండునో మిత్రుని పైఁగూడ అట్టి స్వాతంత్రత, అధికారము నుండును; లేనినాఁడు-అది నిక్కమైన స్నేహము

కాదందురు. మల్లాజీ! నీవంటి యుత్తమ మిత్రుని
కోర్కెను - కాదు, ఆజ్ఞను - త్రోసివేయు నంతటి
యవివేకిని కాను.

మల్లా: దిగంబర్, దిగంబర్! క్షమింపుము. నేను మామూలుగ
నేదియో అంటిని. దానికై యింతగ చెప్పవలెనా!
నీ యుదార హృదయము నే నెఱుఁగనిది కాదు. నీవంటి
హితుఁడు నిధి వంటివాడు. ఘనము మిత్రుల
మగుట నా సుకృతము.

దిగం: (నవ్వుచు) మల్లాజీ! మాటవరుసకు లోకపు తీఱు
చెప్పితిని. కాని, యిందు ప్రత్యేకముగ మనమాట
యేమియులేదు. ఇంతకును విశేషమేమియో చెప్పక
పోతివి?

మల్లా: (నవ్వుచు) స్వవిషయమే.

దిగం: అన్నచో?

మల్లా: అహ్మదునగరపు సుల్తానుగారి కొలువులో చేరవలెనని
కోరిక.

దిగం: మంచిది. కోరిక బాగున్నది. తప్పక తీరవలసినదే!

మల్లా: అనఁగా!

దిగం: అనఁగా, చేరఁదలఁచినది యోగ్యమైన స్థానము;
దానికి కావలసిన అర్హతలన్నియుఁగలవాఁడవు; ఇఁక
పని జరుగకుండునా? అని తాత్పర్యము.

మల్లా: (నవ్వుచు) నీ తాత్పర్యము, నా ప్రతిపదార్థము

బాగుగ నుండవచ్చును. కాని, పని జరుగుటెట్లని నా సంశయము. తగిన మార్గముఁ జూపుమనియే నిన్ను గోరుట.

దిగం: ఏమి, మల్లాజీ! అన్ని విధముల నున్నతపదవి కర్హాత గల నీ వాశ్రయించినచో సుల్తానుగారు కాదందురా? ఆయన, ప్రతిభను గుర్తించి సత్కరించు ప్రభువని విందుముకదా? మఱి నీ కీ సంశయమేల?

మల్లా: నిజమే; నీవు చెప్పినట్లు సుల్తానుగారు అట్టివారే కావచ్చును. కాని, 'దేవుఁడు వరమిచ్చినను పూజారి వరమీయఁడు' అని నామెత యున్నదికదా? సుల్తాను గారిచుట్టు నుండువా రెవ్వరును 'పానకములో పుడక' పనికి పూనుకొనకుండవలెను; తగిన సమయమున సుల్తానుగారి దర్శనము జరుగవలెను. అపుడు కదా యాతని మనసు రంజించునట్లు మాటలాడి నైపుణ్యముఁ జూపఁగల్గునది! తరువాత 'వారిచిత్తము, మన భాగ్యము.'

దిగం: అట్లయినచో, మనము ముందుగ యాదవరావుజీని చూతము. అతఁడు నేనెఱిఁగినవాఁడు. సరసుఁడు. గొప్ప జాగీరుదారు. అతనిప్రతిష్ఠను గూర్చి యిప్పటికే నీవును వినియుందువు. సుల్తానుగారి మనసుకెక్కిన వారిలో నతఁడొకఁడు. మన కీ విషయమున నతని సాయము తప్పక లభించునని నాకు నమ్మకమున్నది.

పరిచయమేర్పడినచో త్వరలోనే మీరిరువురు నొకరి నొకరు విడిచియుండఁజాలనంతటి మైత్రి పెంపొందించు కొనఁగలరు.

మల్లా: ఔను, యాదవరావుజీ పలుకుబడినిగూర్చి వినియు న్నాను. ఆయన నెపుడు చూతమందువు?

దిగం: ఎప్పుడో యననేల? 'శుభస్య శీఘ్రమ్మ'ని పెద్దల వాక్యము. రేపే వెళ్లుదము.

మల్లా: దిగంబరరావుజీ! నాయందు నీకు ప్రేమ అపారము.

దిగం: స్నేహము విషయమున నిట్టి ప్రశంస కూడదు. అన్నియు చక్కఁబడినపుడుసుమీ మన పరిశ్రమ ఫలవంతమైన దనుకొనవలసినది. తప్పక పని జరుగునని యే నా నమ్మ కము. మన ప్రయత్నము మనము చేయుదము. రేపు మఱల కలియుదము; నేఁటికి సెలవా?—అనుచు దిగంబరరావు మల్లాజీయిల్లు విడిచి గృహోన్ముఖుఁ డయ్యెను. మల్లాజీయును బయటికి వచ్చి, దిగంబర రావును కొంతదూరము సాగనంపి, తిరిగివచ్చుచు, "ఆడఁబోయిన తీర్థమెదురైనది'. దిగంబరరావు సూచన ఫలింపవచ్చును. రేపటితో నా ప్రయత్న మొకరూపము నందవచ్చును" అని యనుకొనుచు నింటిలోని కేఁగెను.

---

# 5

మల్లాజీకి చెప్పిన మాటచొప్పున మఱునాఁడు దిగం బరరా వాతనిని వెంటనిడుకొని రఘోజీ యాదవరావు భవ నమున కరిగెను. యాదవరావు వారిని సగౌరవముగఁ గూర్చుండఁజేసి కుశలప్రశ్నము జరిపెను. ఉచితరీతిని జవా బొసంగుచు దిగంబరరావు మల్లాజీవిషయమున ప్రస్తావన సాఁగించెను.

దిగం : మీ పేరు ప్రతిష్ఠలను విని మల్లాజీ మిమ్ము దర్శింప వలెనని మిక్కిలిగ ఉవ్విళ్లూరుచుండుటచే స్వతంత్రించి నేను వెంటఁబెట్టుకొని, వచ్చితిని.

యాద : ఎంతమాట ! మిత్రుఁడవు, నీకులేని స్వాతంత్ర్య మెవరి కున్నది ? నీకు మిత్రుఁడైనచో నాకును మిత్రుఁడేకదా?

దిగం : ఈ ఒక్కమాటవలననే మీ సౌజన్యము, మాయందు మీకుఁగల యనురాగము, అభిమానము వెల్లడియగు చున్నవి.

మల్లా : నేఁడు సుదినము. 'సజ్జనసందర్శనము సంపత్కర'మని పెద్దల నానుడి. ఇన్నినాళ్లుగ మిముఁగూర్చి వినుటయే కాని, మిమ్ము స్వయముగ దర్శించి, మీతో భాషించు భాగ్యము కలుగలేదు. మిత్రుఁడు దిగంబరరావుజీ ధర్మమా యని నేఁటి కదియు సిద్ధించినది.

యాద : మీరేమో పెద్దమాటలతో నన్నుగూర్చి హెచ్చుగ

పలుకుచున్నారు!

మల్లా: : మీ నయభాషణము మీయున్నతకి మెఱుఁగు వెట్టు చున్నది.

దిగం: సాధారణముగా ఎంతయో పరిచయముండినఁగాని యెదుటివారితత్వమును సరిగ తెలిసికొనుట సాధ్యము కాదు. మల్లాజీ కుశాగ్రబుద్ధి. ఇతఁడు తూచినట్లు మీ సహజమగు సౌజన్యము నింతలో తెలిసికొనఁ జాలెను. గుణవంతులు గుణవంతుల నాకర్షింతు రనుట యిట్టిదేకదా? ఉత్తమపరీక్షకుఁడు రత్నము విలువ నవలీలగ చెప్పును; గాజుకుప్పె నంటకయే యావల నుంచును. ఎదిరిప్రతిభ నెఱిఁగి వర్తించుట భోన్స్లాలకు వెన్నతోఁబెట్టిన విద్య. విద్యావంతుఁడగు మల్లాజీయొక్క మాటలపొందిక, వ్యవహారజ్ఞానము మెచ్చఁదగినవి.

యాద: నిజమంతియే. భోన్స్లాలు ప్రతిభావంతు లనుటకు సంశయముండదు. మల్లాజీతో పరిచయ మమూల్యము. ఇతఁడును అహమ్మదునగరవాసియయ్యెఁగాన, మన యీ పరిచయము వృద్ధియై, శాశ్వతముగ నిలువఁగల దనుకొనవచ్చును.

మల్లా: అదియే నా కోరిక-ప్రార్థన.

దిగం: నాకు మిక్కిలి సంతోషమగుచున్నది. మల్లాజీ అహ్మదు నగరవాసి యగుటయేకాదు. మఱియొక అడుగు

ముందునకు సాఁగి, తన సామర్థ్యముఁజూపి అహ్మాదునగ రపు టభినందనము లందఁగోరుచున్నాఁడు.

యాద : సుల్తానుగారికొలువులోఁ జేరవలెనని యుద్దేశము కాఁబోలు ?

మల్లా : అర్హత యున్నచో, నా యాశయమదియే! నా యర్హతను నేను చెప్పుకొనుటకంటె, మీవంటివారు చూచి నిర్ణయించుట అవసరము. అర్హత లేదని నేను తెలిసికొన్నచో తక్షణమే నాకోరికను విరమించుకొనఁ గలను. 'గొంతెమ్మ కోరికల' వలన ప్రయోజనముండ దని నా నమ్మకము.

యాద : మల్లాజీకి మంచి భవిష్యత్తు కలదని తోఁచుచున్నది.

మల్లా : మీ యాశీర్వాద బలము.

దిగం : సుల్తానుగారి దర్శనమైనచో, మల్లాజీకోరిక నెఱవేఱఁ గలదని నా నమ్మకము. ప్రతిభావంతులకు అహ్మాదు నగర మాశ్రయమని ప్రతీతి. మల్లాజీ యదృష్టము మంచిదైనచో సుల్తానుగారి కొలువు దొరకును.

మల్లా : నేఁటి యీ సమావేశముతో సంశయములను మబ్బు తెరలు విచ్చినవి. భవిష్యత్తును పాఱఁజూచినచో బంగారు రేఖలు పొడగట్టుచున్నవి.

యాద : ఇంతటి యుత్సాహవంతునకు నెఱవేఱని పని యుండదు.

మల్లా : మీ దర్శనమున నా యుత్సాహ మినుమడించినది.

దిగం : ఉత్సాహమే కాదు. ఉన్నతియు నినుమడించును.

యూద : (చిఱునగవుతో) నామీఁద నేదియో పెద్ద భారము పెట్టఁజూచుచున్నట్లున్నది.

దిగం : మల్లాజీకి సుల్తానుగారి దర్శనము చేయింపుఁడని మా కోరిక.

మల్లా : మా ప్రార్థనను మన్నింపక తప్పదని మనవి.

యూద : సుల్తానుగారి దర్శనము సులభమైనపనియే! దానికై మీరు నన్నింతగ నేల కోరుచుంటిరో తెలియదు.

మల్లా : సుల్తానుగారిని దర్శించుట సులభమే కావచ్చును. కాని, మీవంటివారి పరిచయభాగ్యము గలవాఁడ నని యాయన తెలిసికొనినఁగాని కార్యము ఫలింపదని నాతలంపు.

దిగం : మల్లాజీ స్వయముగ నే సుల్తానుగారిని దర్శింపఁగలఁడు. దానివలన ప్రయోజనమేమి? సుల్తానుగారి దర్శన మందఱకు లభింపవచ్చును. కాని, యాయన దయ లభించుట అంత సులభముకాదు కదా? అందుకై యెక్కువ యోగ్యత అవసరము. అది మీతోడి పరిచయము. తగిన సమయముగూడ సమకూడ వలెను. అది మీరు విచారించి యెఱిఁగింపవలెను.

యూద : అట్లే కనుఁగొందును.

దిగం : మీమాట సుల్తానుగారి మనసుకెక్కును.

యూద : ఇంతకును అవకాశముగూడ నుండవలెనుకదా?

మల్లా : అది నా భాగ్యము.

యాద: అవకాశమునుబట్టి యాలోచింతము.

దిగం : వీలున్నంతలో సాయముచేయుఁడు.

యాద: ఇన్నిమార్లు చెప్పవలెనా ?

మల్లా : మీ యాదరణకు కృతజ్ఞుఁడను.

దిగం : సెలవా ?

మల్లా : నేఁటికి సెలవు తీసికొందును.

యాద: మంచిది; పోయి రండు.

పని ఫలవంతము కాకపోదనుకొనుచు దిగంబరరావును, మల్లాజీయును గృహోన్ముఖులైరి.

## 6

"కాయా, పండా? చెప్పరేమి? ఆలోచన యెందుకు? కాయా? పండా? పలుకరు? లేఁడా? కాదనినాఁడా? దిగంబరరావుజీమాటలు, నీటిమూటలేనా? సంగతి యేమి?"-అని, గుమ్మములో కాలిడుచున్న మల్లాజీపై ప్రశ్నల పరంపర సాగించినది దీపాబాయి. చంకలోనిబిడ్డను సవరించి ముద్దిడుకొనుచు "ఏమిటి, ఏమాటయును చెప్పరు! కన్నులప్పగించి నిలుచుట నేర్చుకొనుచున్నారేమి? పోయినపని యేమయ్యెనో యింటికి వచ్చినవెంటనే చెప్పవలెనని యింకెప్పుడు నేర్చు

కొందురో? ఇదుగో, షాజీ. నాకుఁగాకున్న వీనికై నఁజెప్పుఁడు. కాయూ, పండా?'' అనుచు ఆమె మఱల ప్రశ్నించినది.

"కాయయుఁగాదు, పండునుగాదు'' అనుచు చిఱునగవుతో మల్లాజీ మెల్లగ పల్కెను.

దీపా : ఇదెక్కడి విడ్డూరము! క్రొత్తపట్టణమునకు వచ్చుటతో క్రొత్తవిద్యలు పట్టువడుచున్నవి కాఁబోలు! కాయ కాదఁట, పండు కాదఁట! ఎక్కడి సరసము! ఎవరైన విన్న నవ్విపోదురు. చాలు లెండి, ఫలితమేమియో ముందు చెప్పుఁడు. తరువాత మీ చమత్కారముల సంగతి చూడవచ్చు.

మల్లా : చెప్పుచుండగనే యింతతొందరయేల? నిజమదియే. కాయ కాదు; పండు కాదు; దోరమాఁగినది.

దీపా : అనఁగా?

మల్లా : వినఁగా తెలియును.

దీపా : వీనులవిందా?

మల్లా : తేనెలపొందు గూడ.

దీపా : సరి, దారికి రండు. యాదవరావుజీ కన్పించెనా? దిగంబరరావుజీ యిక్కడ చెప్పినంత చనువుగ ప్రవర్తించెనా?

మల్లా : దీపా! నీకు అన్నియు ననుమానములే. అందులో ఆత్రము హెచ్చు.

దీపా : లేదు లెండు. అట్లయినచో తిన్నగ నున్ననిసోఫాపై

కూర్చుండి, చల్లగా, మెల్లగా, విశ్రాంతిగా ఒక్కొక్క మాట ఒక్కొక్క సారిగ చెప్పుఁడు. ఇదుగో మీకు తోడు,—అనుచు షాజీని అందిచ్చెను.

మల్లా : షాజీ, బంగారుకొండ. వీని యదృష్టమే. పని అనుకూలమగుననియే తోఁచుచున్నది. యాదవరావుజీని కలిసి మాటలాడినారము. అతఁడు మంచి యాదరణ చూపినాఁడు.

దీపా : యాదవరావుగారన్నచో సుల్తానుకు గుండెకాయయఁట. ఆయనపలుకుబడి, ఐశ్వర్యము మొదలగు వానినిగూర్చిన ముచ్చట్లు వినిన ముక్తాబాయి, ఇందుబాయి చెప్పిరి. ఆయన చాల మంచి వాఁడని పేరఁట. కనుకనే మీ ప్రయత్నము సఫలమగునని నాకు నమ్మకము కలిగినది. అందు వలననే ఆ మంచిమాటను చెవిలో వేసికొనవలెనని తొందరపడితిని.

మల్లా : నీవు విన్నది నిజమే. చూడఁగనే యాదవరావుజీ అట్టి వాఁడనియే నాకు తోఁచినది. ఆయనతో మాటాడుటయే. గౌరవ మనిపించినది.

దీపా : సుల్తానుగారికి సిఫారసు నిచ్చెదననినాఁడా ?

మల్లా : సామాన్యులకును, గొప్పవారికిని గల భేదమదియే. ఆయనవలె సుల్తానుగారితో పరిచయమున్న యింకొక వ్యక్తియైనచో - అడుగఁగనే, 'సుల్తానుగారా ?

నేనెంత చెప్పిన నంత' అని పల్కెడివాఁడే.

దీపా : మఱి, ఆయన యేమనెను?

మల్లా : ఏమనె ననుకొందువు?

దీపా.: నేననుకొనుట కేమి లెండు! అనిన దేదియో చెప్పుఁడు.

మల్లా: 'అవకాశమును బట్టి యాలోచింతము' అనెను.

దీపా : ఈమాటనుబట్టుకొనియేనా దొరమాఁగినదని సంతో షించుచుంటిరి? అయినచో, 'సీరు కారి'నట్లే.

మల్లా: పొరపడుచున్నావు. తప్పక చేయఁదలఁచిన పనిని గూర్చియు నట్లనుట గొప్పవారి లక్షణము. అంతటి వాఁ డామాత్ర మనుటయే పదివేలు. నీవు లోకము పోకడను బాగుగ గమనింపవు. ఎట్టి పనికైనను, 'అబ్బే, అదెంత? తప్పక చేయుదును' అనువారి వలన పనులు జరుగుట యరిది. పనులు కాని సందర్భములలోఁగూడ నట్లనుట వారి కలవాటు. సాధారణముగ ఫలితముమాత్రము శూన్యము. యాదవరావుజీ ఆ తరగతికిఁ జెందినవాఁడు కాఁడు. కావుననే, ఆయనవలన తప్పక సాయము జరుగునని తలంచుట.

దీపా : మీకెక్కడ నమ్మకమెక్కువయో, అక్కడనే నా కనుమాన మధికము; ఏమి చేయుదును?

మల్లా: ఏమియు చేయనవసరములేదు; మిన్నక చూచు చుండుము. అన్నియు ననుకూలములగును. ఇదుగో

షాజీ, నా మాటయే గెల్చునని నవ్వుచున్నాఁడు.

దీపా: కాదు; మీ మాటలో నమ్మకము లేదని నవ్వుచున్నాఁడు.

మల్లా: లేదు; నీ యనుమానమునుగూర్చి నవ్వుచున్నాఁడు. కాదటోయి, షా?

దీపా: అవునటోయి, షా?—అనుచు నిద్దరు, చిదిమిన పాల్గారు షాజీ లేఁత బుగ్గలపై ముద్దు లద్దిరి.

# 7

నాఁడు షాజీ పుట్టినరోజు. మల్లాజీ యింటిలో నుల్లాసము వెల్లివిరిసెను. గృహమంతయు చక్కఁగ నలంకరింపఁబడుచున్నది. పనికత్తెలలో పోటీ పరవళ్లు త్రొక్కుచున్నది.

"ముగ్గులుపెట్టు నాపని ముందుకావలయును."

"దొరసానిగారి మెప్పు దొరుకుట ఎవరికో యీరోజు చూడవలయును."

"సుందరి పేరులోని అందము పనిలో లేదే?"

"నీ మాటలలోని పస నీ రూపములో లేనట్లే!"

"అబ్బ! అంత రూపవతివి కాఁబోలు? చిదిపి దీపము పెట్టుటయే తరువాయి యేమో!"

"ఇట్లే మాటలతోఁ బ్రొద్దు జరిపితివా ముందు నిన్ను చిదిపిపెట్టును దొరసానమ్మ!"

"మాటలాడుచున్నను, పని మానక చేయుచున్నానని చూడలేవా ఏమి?"

"నేను చూచుటెందులకు? చూచునది, తప్పులున్న చేయి చాచునది దొరసానమ్మగారు."

"కాదులే, ఈ 'కాన్త'లో నీకు నాయకురాలి పని వచ్చినదని యనుకొంటిని."

"అనుకొందువు, నీకేమి ఆపా, హద్దా?"

"రెండును ఉన్నవి. కదిలినచో నీమాటలు ఆపు; కదలకున్న నీ యాకారము హద్దు."

"చాలులేవే, నంగనాచీ!"

"అయినదమ్మా నాపని. పూలచెండ్లు గ్రుచ్చుట పూర్తియైనది."

"నావంతు గంధము తీయుటగూడ పూర్తియైనది."

"పన్నీరు కలుపు నాపని కాలేదనియా? ఇదిగో, నిమిషములోనే అయినది."

"అప్పుడే వచ్చుచున్నారు ముత్తైదువలు."

"అందరును పిలుపు అందినవారేనా?"

"గొప్పవారియిల్లు అనఁగానే పిలువనివారు గూడ కొందరు వచ్చుచుందురని నీవింకను తెలిసికోలేదా?"

"చాలులేవే! పిల్లకానా! చాలించు నీ ప్రసంగము!

'కందకు లేని దురద బచ్చలికెందుకు?' గొప్పవారి విషయముల నెటు చెప్పినను కష్టమే. కత్తిమీఁది సామువంటిది. 'కంటికి తగిలే పుల్లను కని పెట్టి నడువవలె' నని మఱచిపోకుము''— అనుచు, తలకొక మాట దొర్లించుచు, పనికత్తెలు తమతమ వంతు పనులను చక్కఁబెట్టిరి.

ముత్తైదువలు వచ్చిరి. దీపాబాయి స్వయముగ పేరులతోఁ బిలిచి యందఱ నాదరించి కూర్చుండఁబెట్టెను. పాజీ చక్కఁగ నలంకరింపఁబడెను. వేడుకలు ప్రారంభమయ్యెను. ఒకప్రక్క పాటలు; వేఱొకచక్కి మాటలు; 'ఎకసక్కెములు, పకపకలు!'

ముత్తైదువలకు మర్యాదలన్నియుఁ గ్రమముగ జరుగుటకు దీపాబాయి యేర్పాటు గావించెను. కొందఱు వీవనలు పట్టుటకు నియమింపఁబడిరి. పసుపు పూయుటకు కొందఱు. బొట్టు పెట్టుటకు మఱికొందఱు. పండ్లు పంచుట కొందఱ పని. పన్నీరు చల్లుట మఱికొందఱ విధి. అత్తరుపూయుట కొందఱ వంతు. తాంబూలము లిచ్చుట మఱికొందఱవంతు. 'పింగళి వారి పేకి'వలె చెప్పుటయే తడవుగ నందఱు నన్ని పనులను నిర్వర్తించుచుండిరి. దీపాబాయి చూపు నాదరణకు, చతురతకు ముత్తైదువలు మురిసిపోయిరి.

''చిట్టిబాబు సింగారమును వదినెగారే స్వయముగ చేసినట్లున్నది?''—అన్నది ఒక లతాంగి.

''అది మా యన్నగారి యాజ్ఞయేమో?''—అని

యింకొక యిగురుబోఁడి యందుకొన్నది.

"అయినను వదినెగారి వాసి తగ్గదు లే" అనినది తొలుతటి తొయ్యలి.

"వాసి హెచ్చునేమో!" అని కల్పించుకొన్నది వేఱొక కాంతామణి.

"వారి వాసి-వన్నె కొలుచు కొలఁతబద్దలా యేమి మీారు?"—అని సూటిగ ప్రశ్నించినది మఱొక సుందరాంగి.

"కొలఁతకు అవసరము భేదముండినఁగదా వారిలో" యని సూచించినది కొండొక సుదతీమణి.

"చెల్లెండ్రు తర్కములోఁ బడిరి. అయినను నాకెందుకు పెద్దదానను? మంచి వేడుక జరిపినది దీపాబాయి. ఈమె కడుపు చల్లగ షాజీ నూఱేండ్లు వర్ధిల్లవలె. ఈ యత్తరు పన్నీరువలె షాజీ గుణములందఱిని ఆకర్షింపవలె" అని యాశీర్వదించిన దొక పండుముత్తైదువ.

"షాజీకి తమ్ములు చెల్లెండ్రు తప్పక కలుగవలెను" అని నవ్వుచు పలికిన దొక జవ్వని.

"అంతే అంతే" అనుచు వారిజాక్షులు కొందఱు వంతపాడిరి.

ముత్తైదువలు పెక్కిరిట్లు పాటలవెంట మాటలఁగలుపుచు, పండుగకు నిండుసోయగము నించి, పూర్తిగావించిరి. వారి పలుకులకు దీపాబాయి చిఱునగవు దొంతరలు జవాబులుగ వర్తించెను.

# 8

దిగంబరరావుమూలమునఁ గల్గిన పరిచయమును పురస్కరించుకొని మల్లాజీ యాదవరావు భవనమునకు రెండు, మూఁడుసారులు వెళ్ళి వచ్చెను. 'లోకాభిరామాయణము'తో ప్రసంగములు జరిగెను. కాని సుల్తానును చూచువిషయమై యాదవరావేమియు సూచింపలేదు. మల్లాజీయు మాటాడుటకు సాహసింపలేదు.

రోజులు గడచినవి. మాసములు నడచినవి. కాని, మల్లాజీకోర్కెనుగూర్చి యాదవరావొక్క మాటయు మఱల పలుకలేదు. చూడవెళ్లినప్పుడెల్ల మల్లాజీ కతఁడు చూపు మర్యాదలో లోటులేదు. 'తొలినాడెట్లో మలినాఁడు నట్లే' యనినట్లుండెను. కాలము మాత్రము దొర్లుచుండెను.

మల్లాజీస్థితి యిఱుకటమైనది. కోరిక తీరకపోయెనని మనసులో ఆవేదన యధికమైనది.

'ఏమండీ! యాదవరావుజీ ఏమనినారు?' అని రోజు రోజు ఇంటిలో నిల్లాలి ప్రశ్నలు.

'పదేపదే చెప్పుట పాడిగాదు. చెప్పినమాట మఱచు వాఁడు కాడు యాదవరావుజీ' అని దిగంబరరావు ఓదార్పు.

' "నా విషయమేమి చేసితిరి?" అని యాదవరావును సూటిగ ప్రశ్నించుదమన్న, — "తొందరపడినచో పనులు కావుసుమీ" —అని మందలించునేమో? నే నడుగక మిన్న

కున్నచో, అవసరమున్న వాఁడు అడుగకపోయెనని యుపే క్షించునేమో? దివాణములోని సమాచారము లేమో 'ఇది మిత్థ'మని తెలియుట లేదు. అవకాశ మిపుడున్నదో, రాను న్నదో, మిగిలిపోయినదో ఎవరు చెప్పఁగలరు? ఏమి చేయ వలెను? ఏమి చేయరాదు? ఏమైనను పని జరుగవలెను. ఏ పనికిని ఎక్కువ తొందర కూడదందురు కదా? అట్లని యూర కుందునా? అధికముగ నాలస్యమైనచో అమృతముగూడ విష మగునందురే? మధ్యమార్గమేమి?' అని మల్లాజీ యాలోచన.

'ఏపనికైనను కొంత సహనము అవసరము. అట్లని సాహసముగూడకొంతయుపయోగకరముకాకపోదు. ఏమైనఁ గానిమ్ము. నేఁడు యాదవరావుగారిని కలిసికొని ఏమి జరిగి నది కనుఁగొందును. దిగంబరరావును గూడ వెంటఁబెట్టుకొని పోయిన బాగుండునుకదా? నాకు బదులతఁడే ప్రశ్నించును. దానితో విషయము తేలును. కాదు. ఒంటరిగ యాదవరావు గారినెన్నిసారులో దర్శించితిని. ఆయన మిక్కిలి మర్యా దగ మాటలాడుచుండెను కదా! ఇంతలో నీ పనికై దిగం బరరావును తీసికొని వెళ్లినచో నా త్రిడిచేసి నట్లుండును. అందువలన నాయన మనస్సునకు కష్టముకలుగవచ్చును. దాని కేల యవకాశ మీయవలెను? అదియే కాదు; చీటికి మాటికి దిగంబరరావును తీసికొని వెళ్లినచో ఎట్లుండును? అతఁడు లేనిదే ఏపనియు చేయలేనివాఁడనని నన్నుఁగూర్చి యెవరైన ననుకొనవచ్చును కదా! అట్లయినచో నాకేమి ప్రాముఖ్య

ముందును? ఇదేమి? పని యగుట ప్రధానమా, నా ప్రాముఖ్యము ప్రధానమా? రెండును అవసరమే. కాఁబట్టి రెండింటిని సాధించవలెను. దీనికి మార్గము? యాదవరావుగారితో విషయమును స్వయముగ ప్రస్తావనకుఁ దెచ్చుటయే'—అని తుదకు మల్లాజీ నిశ్చయించుకొని, యొకనాఁటి సాయంకాల మతఁడు యాదవరావు భవనమునకు బయలుదేఱెను.

## 9

సాయంసమయమున పూలతోఁటలో విశ్రాంతిఁ దీసికొనుచున్న యాదవరావును సమీపించి మల్లాజీ నమస్కరించెను. యాదవరావు సగౌరవముగ నతనిని ఆసన మలంకరింపఁజేసెను. పూఁదోఁట యందమును బురస్కరించుకొని మల్లాజీ సంభాషణ మారంభించెను.

మల్లా: ఈ పూఁదోఁట మిక్కిలి యందముగ నున్నదండీ! మీరు దీనినిగూర్చి ప్రత్యేకముగ శ్రద్ధతీసికొని యుందురు.

యాద: నేను ప్రత్యేకముగఁ దీసికొనిన శ్రద్ధ యేమియున్నదండీ? మాతోఁటమాలి కష్టించి పనిచేయును. అన్ని మొక్కలను ప్రేమతోఁ బెంచును.

మల్లా: మొక్కలను పెంచుట పిల్లలను పెంచుటవంటిది.

ఎల్లప్పుడును తగిన పోషణ యుండినఁగాని అవి వృద్ధి పొందవు. ఇంతకును యజమానుఁ డభిరుచి గలవాఁడైనచో, తోఁటమాలి శ్రద్ధతీసికొనక తప్పదు. చెంత పూఁదోఁట యుండుటవలన భవనమునకు శోభ హెచ్చును.

యాద: అన్ని హంగులు కల్గిననే కదా దేనికైనను అందచందములు?

మల్లా: బాగుగఁ జెప్పితిరి. అది సత్యము, సహజము గూడ.

తాను గోరుకొనినమాట మల్లాజీకి మనసులోఁ దట్టినది. కాని, వెలుపలికి పొంగలేదు. తన సమాధానమును పొడిగించినాఁడు—

"కాని, హంగులను కల్పించుకొనుటకుఁగాని, కల్పించుటకుఁగాని యవకాశములును ఉండవలెను కదా!"—అని.

యాద: నిజమంతియే. అవకాశమునుబట్టియే పనులు జరుగును. అవకాశము లేనపు డవసర మెంతయున్నను ప్రయోజనమేమి యుండును?

మల్లాజీకి మనస్సులో ఆందోళన హెచ్చినది. తాఁ గోరిన విషయమునుగుఱించియే యాదవరావుజీ యటులను చుండెనా?—యనుమానము కల్గినది. మఱల సంభాషణము సాగించినాఁడు మల్లాజీ.

"సాధారణముగ నంతియే. కాని, కొన్ని సందర్భములలో కొన్ని పనులు జరుగుట కవకాశమే కల్పింపఁబడవలసి

యుండును'' అని యతఁడనెను.

ఇట్లనెనేగాని యంతటితో మల్లాజీకి మనశ్శాంతి కలుగలేదు. సుల్తాను దర్శనమును గూర్చి తా నడిగిన విషయమునకు సమాధానముగనే యాదవరావుజీ యట్లనుచుండెనని మల్లాజీకి అనుమాన మినుమడించినది. పని కాదని తేటతెల్లముగ చెప్పుటకుఁగాని, తొందరపడకుమని నూటిగ హెచ్చరించుటకుఁగాని యిష్టము లేకయే యతఁడట్లనుచుండె ననియే మల్లాజీనమ్మకము. అట్టి స్థితిలో నిఁక యాదవరావును స్పష్టముగ నడుగుటవలన లాభము లేదనియే యతఁడు నిశ్చయించుకొనెను. యాదవరావుజీ యుద్దేశపూర్వకముగ నట్లనుచుండెనో, లేక ప్రసంగవశమున సందర్భమునుబట్టి సాధారణముగ నట్లనుచుండెనో తెలిసికొనఁగోరి మల్లాజీ మఱల నిట్లు పల్కెను—

''మీ భవనమునకుఁగల పెద్ద యావరణము చక్కని తోఁటను పెంచుట కవకాశమిచ్చినది. ఇంత యావరణము లేకున్నను తోఁట కావలె ననుకొన్నచో, నది పెరుగుటకు తగిన యవకాశమును కల్పింపలేకపోరు''—అని.

యాద: ఔను, ఆమాటయు నిజమే. 'మనసు గల్గిన మార్గముండు'నని సామెత యున్నది కదా?

తల్లడిల్లిన మల్లాజీ మనస్సు చల్లఁబడినది. ముఖము విప్పారినది. ఆలసింపక యాతఁడందుకొనెను :

''ఔను, ముఖ్యముగ మీఁబోటివారియెడ నాసామెత

తప్పక వర్తించును. సమర్థులు తలపెట్టిన పనులు జరుగక తప్పవు,''—అని.

అంతటితో మల్లాజీకి తృప్తికలుగలేదు. తాను యాదవరావు నర్థించిన విషయమేమయ్యెనో ఎంతకు నతఁడు చెప్పకుండుటచే లోలోనఁ జింతించెను. విషయము నెటులైన రాఁబట్టనెంచి యిట్లనెను:

''మీ పరిచయ మేర్పడినప్పటినుండియు మిమ్ము తఱచుగ దర్శింప వచ్చుచున్నాను. దీనివలన మీ పనులకేమియు భంగము కల్గుట లేదుకదా? ఎక్కువ స్వాతంత్ర్యము దీసికొనుచున్నాను.''

యాద: మిత్రులను తఱచుగ కలియుట నాకు సంతోషకరమైన విషయము. దీనికై మీ రింతగ నొచ్చుకొను టెందులకు?

యాదవరావు చెప్పిన సమాధానము సరసముగ నున్నది. కాని, యందు మల్లాజీ యనుకొనిన మాటలులేవు. ఇఁక సూటిప్రశ్న తప్పదని యతఁడు నిశ్చయించుకొని యిట్లనెను:

''లోగడ మిమ్ము సుల్తానుగారి దర్శనమిప్పింపుఁడని ప్రార్థించితిని. మిత్రుఁడు దిగంబరరావుజీగూడ ఆ సందర్భమున సమయముచూచి సాయముచేయుఁడని మీతో చెప్పెను. నాకీ యుపకార మెపుడుజరుగునో తెలిసికొనవలెననియున్నది.''

యాద: ఔను, నేనదియే చెప్పఁబోవుచుంటిని. ఇంతలో మీ రే

యీ ప్రసంగముఁ దెచ్చితిరి. నిన్ననే సుల్తానుగారిని దర్శించితిని. మీ విషయ మించుక సూచించితిని. మీరు సంగతులన్నియు స్వయముగ వారితో చెప్పుకొనవచ్చును. రేపే వారిని మఱల దర్శించుటకు వలయునేర్పాటు చేసితిని. మన మిద్దరము కలిసియే వెళ్లుదము.

మల్లా: చిత్తము. రేపు సాయంకాలమిచ్చటికే వచ్చెదను. కలిసి వెళ్లుదము. మీకు శ్రమ గల్గించుచున్నాను.

యాద: శ్రమ కేమున్నది? మీపనియగుటయే నాకుసంతోషము.

మల్లాజీ: "సెలవా?" అనుచుండ "మంచిది, పోయి రండు" అనుచు యాదవరావు మాట గలిపెను.

# 10

మల్లాజీ 'రొట్టె నేతిలోఁబడినది.' సుల్తాను దర్శనమైనది. యాదవరావుమాట గౌరవింపఁబడినది. మల్లాజీకి ప్రభుత్వోద్యోగము లభించినది. సర్కారు పనిలో నిపుడతనికి శ్రద్ధ యెక్కువ; తీరుబడి తక్కువ.

"ఇదుగో, పాజీ. అంతయు వీని యదృష్టమే! ఏమి బహుమతి నిచ్చెదరో వీనికి?"—అనుచు నొకనాఁడు దీపాబాయి పాజీనెత్తికొని వచ్చి మల్లాజీ కందీయఁబోయినది.

"ఉండుండుము. పాజీకి బహుమతియా? ఇదిగో, వాఁడు

నీచేతిలో నుండఁగా ఒక ముద్దు, నా చేతిలోనికి వచ్చి నపుడు రెండు ముద్దులు బహుమతి! అంతేనా షా?'' అనుచు మల్లాజీ, షాజీ నందుకొని, ముద్దిడుకొనెను.

దీపా : చాలు లెండు, చౌకబహుమతితో సరిపెట్టితిరి. పసికూన, వాఁడడుగలేనివాఁడని తప్పించుకొనఁ జూచుచున్నారు. మఱి నాకేమి బహుమతి? నాకు విలువగల బహుమతి నీయక తప్పదు.

మల్లా: తప్పక. అడుగఁగలదానవు, నిన్నెట్లు తప్పించుకొనగలను? విలువగల బహుమతి నీయవలసినదే. మల్లాజీ మాటతప్పనివాఁడని నీకు చెప్పనక్కఱలేదు కదా ? ఇదిగో, ఇంతకంటె ఎక్కువ విలువగల వస్తువును నీకేమి తేఁగలను? తీసికో, అమూల్యరత్నమును-షాను అనుచు షాజీని దీపాబాయికి తిరిగి యిచ్చెను.

దీపా : వహ్వా! ఏమి చతురత! సుల్తానుగారి కొలువుతో దొడ్డబుద్ధి రావలసినదే; ఏది? పోనిండు 'మాది మాకిచ్చుటయే మడిమాన్యము లిచ్చుట.' ఇప్పటి కిదియే పదివేలు.

మల్లా: అదిగో బండివచ్చినది. అవసరమైన సర్కారు పని కొంచె మున్నది. జరూరుగా పోయి రావలెను.

దీపా : అబ్బా! అపుడే సర్కారుపనితొందరలు పట్టినవి. ఇంక మీ కింట కాలు నిలువదు. దివాణపు చదరంగముతో తీఱికయే యుండదు కాఁబోలు !

మల్లా: అనుభవముగల ప్రాంత యుద్యోగులకే తీరిక లేకుండ పనిజేసినను, సర్కారు పనిలో మెప్పుఁబొందుట సులభము కాదు. ఇఁక క్రొత్తవారిమాట చెప్పనెందులకు? ఏమైనను కోరి తెచ్చుకొనిన కొలువు. ఏమాత్రము లోపము గల్గినను మాట దక్కదు.

దీపా : లోపమెందులకు కలుగును? పనుల నన్నింటిని స్వయముగ శ్రద్ధతో చూచుచుంటిరి కదా? ఇంకేమి భయము ?

మల్లా: కొండెములు చెప్పువారున్నచో లేని లోపములు కనఁబడును. ఎవ రెట్టివారో పూర్తిగ తెలియనపుడు ఎక్కువ జాగ్రత్తతో నుండవలెను. ఒడలంతయు కన్నులు చెవులుగ వర్తింపవలెను. ప్రభువును మెప్పించవలెను. తోడి యుద్యోగుల యభిమానమును సంపాదింపవలెను. ఉన్నత పదవులను చేరుట కిట్లు నిచ్చెనమెట్లు పెక్కు లుండును.

దీపా : మీ రాజకీయశాస్త్రమును, ఉద్యోగసూక్ష్మ ధర్మములను నాముందు వల్లెవేయు టెందుకు? ఇచ్చినవారు మెచ్చవలెను; పుచ్చుకొన్నవారు మెప్పించుకొనవలెను; మధ్య నా కెందుకు? పదవులు, మెప్పులు పంచుకొనను కదా?

మల్లా: క్రొత్తగ పంచుకొను టేమి? అసలు నీవు సహభాగినివే కదా ?

దీపా: అసలు లేదు, వడ్డీ లేదు.

మల్లా: సరి, నీ సల్లాపములతోఁ గూర్చుండినచో సర్కారు పని యేమగును ?

దీపా: ఏమగును ? చక్కఁగ జరుగును. మీరు లేకున్న అహ్మదునగర రాజ్యపు పరిపాలనాచక్రము ఆఁగి పోవును కాఁబోలు !

మల్లా: ఆఁగిపోదు. కాని, లోటు లోటే! ఆకులన్నియు సరిగ నుండినఁగాని చక్రము తిరుగుటలో సౌష్టవము, సౌలభ్యము నుండవు.

దీపా: మీరన్నమాట రాజ్యము విషయమునకే కాదు, ఇంటి విషయమునకుఁ గూడ వర్తించును. మఱి, మీదృష్టి యంతయు ఉద్యోగధర్మములపై నున్నచో ఇంటి మాట యేమగును?

మల్లా: గృహచక్రముఁ ద్రిప్పఁగల సమర్థురాలవు-రాణివి, నీవుండ లోపమేమి? అదుగో! యువరాజు కూడ అవతరించెను, ఇఁక నేమి?

దీపా: మంచిది. బండి వచ్చి చాలసేపైనది. సర్కారుపని పై శ్రద్ధయనఁగ ఇట్టిదే కాఁబోలు లెండి!

మల్లా: ఇదేమి ? ఇంతలో పథకము మార్చితివి !

దీపా: ఇపుడేకదా రాణి నంటిరి; రాణిగారికి బంగారు పతకమును బహుమతిగ తెమ్మని గుర్తుచేయుటకు; ఆ మాట మీనోటఁ బల్కించుటకు. తెలిసినదా ?

"తెలియకున్న తెలిసికొనవలెను గదా రాణిగారి హుకుము"—అనుచుఁ దలపాగ సవరించుకొని, మల్లాజీ బయలుదేఱి పోయెను.

# 11

సర్కారుద్యోగమును సంపాదించిన మల్లాజీ హుందా పెరిగినది. అహ్మదునగరపు ప్రజాసీకము గౌరవించు పెద్దలలో నతఁ డొకఁడైనాఁడు. క్రింది యుద్యోగుల జోహారులతనికి నిత్యనీరాజనములు. ఐనువందలమంది యశ్వారోహకు లతని కనుసన్నలలో మెలఁగుదురు. దినదిన మతఁ డందుకొనకయే పొందు సలాము లసంఖ్యాకములు! చీటికి మాటికి 'చిత్తము, చిత్తము' అనువా రెల్లపుడు చుట్టు నుందురు.

మల్లాజీమాటకు గౌరవము హెచ్చినది. అతనిదర్శనము, పరిచయముఁ గోరువారు పెక్కురైరి. అతనితో స్నేహము గల్పించుకొనువారు, చుట్టటికముఁ దెల్పుకొను వారును హెచ్చిరి.

మల్లాజీ తఱచుగ యాదవరావును దర్శించి యిష్ట కథాగోష్ఠి జరుపును. సర్కారు విషయములను సంప్రదించును. మల్లాజీ హోదా పెరుగుటతో యాదవరావు మల్లాజీల మనస్సులమధ్య దూరము తగ్గుట ప్రారంభించినది.

తన మాటసాయము ఫలించి మల్లాజీకోరిక కొనసాగ నని దిగంబరరావు తృప్తినొందెను. మిత్రుఁడైన దిగంబర రావు తగిన సమయమున సాయ మొనర్చెనని మల్లాజీ సంతోష మందెను. అవకాశము లభించినపుడెల్ల వారు కలిసి సంభా షించుకొందురు. ఇంటి విషయములు మొదలు రాజకీయ ములవఱకు సమస్త విషయములు సామాన్యముగ వారి సంభాషణలలో చర్చకు వచ్చును.

మల్లాజీకి పనిలో చనురక్తి,మాటలలో తీయఁదనము, మనసులో అలోచనయు హెచ్చు.అవకాశమునుబట్టియతఁడు దర్పముగ పనిని నెఱవేర్చ నెఱుఁగును. తీవితోఁబాటు ధైర్యము, కృషితోఁబాటు నమ్మకము గలవాఁడు. విశ్రాంతి లేకున్నను విసుగుగొనఁడు. ఎంతటి క్లిష్టస్థితి యేర్పడినను శాంతబుద్ధితో చక్కఁబెట్టును. పనితొందరలో నున్నను, చూచెనా పరిచయ మున్నవారిని పిలుచును. పిలిచి యాసన మిచ్చును. ఆసన మిచ్చి ముచ్చటించును. ముచ్చటించి ముదము నించును.

ప్రభుత్వపు పనులలో మునిఁగియున్నను మల్లాజీ షాజీతో 'దోబూచు'లాడుటకు సమయము గల్పించుకొనును. పసివాని లాలనలోఁగూడ పరిపాలనా విషయములను భావించుకొనుచుండును. పదవిలో పై మెట్టు చేరు టెట్టులని యాలోచించుచుండును.

మల్లాజీకి పదవి వచ్చి పరపతి హెచ్చినది. దీపా

బాయికి పరపతి హెచ్చి పదవి వచ్చినది. ఇంటినౌకరుల కాజ్ఞలిచ్చుట యనుక్షణ మామెపని యైనది.

పని యున్నట్టుల వచ్చి దినదినము దీపాబాయిని పలుకరించు పడఁతులు పలువురైరి. పరిచయము గల్పించు కొని, వావి గలుపుకొనువారు వందలు, వేలు నైరి.

"అక్కగారు అదృష్టవంతురాలు!"

"మీ మంచితనమును గూర్చి మేము అనుకొనని దినముండదు."

"మహాలక్ష్మివి; నీ కేమమ్మా."

"వదినెగారి యందమునకు తగిన ఐశ్వర్య మబ్బినది."

"పిన్నిగారు పూలపూజఁ జేసి పుట్టినది."

"మంచినోములు నోఁచినవా రన్న మీవంటివారే!"

"చిన్నదానవైననేమి, పదిమందికి చెప్పఁగల దానవు!"

"నీతో మాట్లాడుటన్న మాకెంతో సరదా."

"ఐశ్వర్య మున్నవారి సందడిని చెప్పుకొందుమా! నీవలె మంచితన మున్నవారిమాట చెప్పుకొందుముగాని."

"మీ యిల్లు చూడముచ్చటగును."

"నీవంటి యిల్లా లొక్కతె యున్నను వాడ కంతటికి కళ."

"మన కిన్నాళ్లుగ పరిచయము లేకపోయినను బంధుత్వముమాత్ర మున్నది. మీ తాతగారు, మా బావ

గారి పెద మామగారును అన్నదమ్ములఁట!''

''తెలియక పోయెఁగాని, మనకు దగ్గఱ చుట్టఱిక మున్నదమ్మా! మీ మామగారు మావారి వ్రేలు విడిచిన మామకు తోడి యల్లుఁడేనట!''

''మనకు బంధుత్వము గూడ ఉండియుండును. విచారించిన నందఱము బీరకాయ పీచువంటివారమే కావచ్చు.''

అని తల కొక వడువున నాడువుచు తలిరుఁబోఁడులు కొందఱు దీపాబాయితో సన్నిహితత్వమును సంపాదించు కొనసాగిరి.

## 12

అది ఫాల్గుణము. అనాఁడు హోలీ. ఊరెల్ల పండుగ. ఇంటింట నింపైన అలంకారములు, పెద్దల యుత్సాహము, పిల్లల యుల్లాసము వెల్లువలైనవి. వసంతము వర్షమువలె భేదమెఱుఁగక యందినవారి నందఱను ముంచి యెత్తినది.

వసంతమును నాజూకుగ నాలుగుబొట్లు చిలికినవారు కొందఱు, దూరమైన నేమని చాచి చాఱపడునట్లు పోసిన వారు మఱికొందఱు, లోభబుద్ధి యేటికని కుండపోఁతగఁ గ్రుమ్మరించినవా రింకకొందఱు నైరి.

లేవ మూం! కడవనిండుగఁ గలిపినట్లున్నావు!''

"క్రొత్తబట్టలని కొంచెమైన ఆపరుగా!"

"చిక్కగఁ గలిపితిని. కాని, లోటా చిన్నదైపోయి నది; లేకుండిన"-

"ఒక్కసారితో వదలుట నే నెన్నడు నెఱుఁగను."

"వహ్వా! వహ్వా! నిలువున నిండుగ పట్టినది!"

"చక్కనివాఁడవులే, సొంతము తడిపితివి!"

"హైలెస్స! అందుకోలేనని యనుకొనుచున్నావా?"

"జైలెస్స! చేతికి బాగుగా దొరికితివి."—అని పలువిధములఁబలుకుచు, కులుకుచు, కుప్పించుచు, వసంతము చల్లుచు పిన్నలు-పెద్దలు నెదటఁ జూచినఁ దామై మహో త్సాహమున మునిఁగి యుండిరి.

వేడుక సమయమున చుట్టములను, స్నేహితులను చూచి వచ్చువాడుక చొప్పున మల్లాజీ పాజీని వెంట నిడికొని యాదవరావుభవనమున కేఁగెను. ఇతరులు పెక్కుమంది స్నేహితులు, చుట్టములు నప్పటికే యాదవరావును దర్శింప వచ్చి యచట నుండిరి. మల్లాజీయు వారితోఁ జేరెను. యాదవ రావు వారి నాదరించి మాటలాడుచుండెను.

అచటి పిల్లలగుంపు పాజీ నాకర్షించెను. వెంటనే యతఁడు వారిలో నొకఁడయ్యెను. ఆకర్షణీయములైన దుస్తులతో నతఁడచటి పిల్లలలో-'చుక్కలలోని చంద్రుని'వలె- కళకళలాడెను. అంతలో యాదవరావుకూఁతు రగు జిజీ బాయి జిలుగుబట్టలఁ గట్టుకొని సీతాకోకచిలుకవలె

చివ్వున వచ్చి వారిలోఁ జేరెను.

పిల్లలందఱిదృష్టి జిజీబాయి షాజీలపైఁ బడెను. షాజీ జిజీబాయిని చూచెను. జిజీబాయి షాజీని గమనించెను. పెద్ద లందఱి చూపు వారిపై మరలెను. చూచుచుండఁగనే షాజీ జిజీబాయిపై వసంతముఁ జల్లెను. జిజీబాయి షాజీపై వసం తము నొలుకఁబోసెను. పిల్లలు గొల్లుమనిరి. చప్పట్లు మ్రోఁగెను. పెద్దలు పక్కున నవ్విరి. విరియఁబాఱిన మోదుగులవలె జిజీబాయి షాజీలు మెఱసిపోయిరి.

"ఈడు జోడు బాగుగ సరిపోయినది. వీరిద్దఱు ఆలు మగలైనచో అందముగ నుండును" అని యాదవరావు మందహాసము చేసెను. కొందఱు "భేషు, భేషు" అనిరి, కొందఱు 'యాదవరావు నిండుమనసుతో నిట్లనుచుండెనా?' అనునట్లతని ముఖభావములను వీక్షించిరి. కొంద ఱిది సంభ వమా? అనునట్లు ప్రక్కవారిని పరికించి, చూపులతోడనే ప్రశ్నించి యూరకుండిరి. 'ఏమగునో, యెట్లు చెప్పగల?'మను నట్లు మఱికొందఱు చిఱునగవులఁ బరపి సరిపెట్టుకొనిరి.

మల్లాజీ భావవీథిలో మెఱపు మెఱసినది. యాదవ రా వాడిన పలుకులు కపురపుఁ బలుకులవలె ఘుమ ఘుమ లీనినవి; తేనెచినుకులవలె తీపి గొల్పినవి. వానిని యదార్థములు చేయవలెనని యతనికి తలఁపు గల్గినది. తలఁపు నిశ్చయమైనది. అతఁడిట్లనెను—

"విన్నారుకదా యాదవరావుజీ పలుకులు! అవి చెల్లు

బడి కావలెనని నా యభిమతము. గౌరవనీయులు మాటతప్ప రని నా నమ్మకము.''

మల్లాజీ మాటలను వినుచున్న యాదవరావు ముఖము చిట్లించెను. ''మల్లాజీ యిట్లనుచుండెనేమి!'' అనునట్లు అచటి పెద్ద లొకరిముఖము నొకరు చూచుకొనిరి. ఎవరేమి చెప్పు దురో యని యందఱు చెవులు నిక్క వొడుచుకొనిరి.

యాదవరావు పెదవులు కదలినవి. మాట పొంగలేదు. మల్లాజీ యటునిటు చూచెను. తక్కినవారిలో కనుగీటులు, తల యూపులుఁ దప్ప సంభాషణ లేమియు సాగలేదు. 'ఔ'నను టకు, 'కా'దనుటకు నోడి వారు నోటికి తాళము వెట్టుకొనిరి. అంతలో పిల్ల లచటకు వచ్చుటయు, అందఱు లేచి సెలవుగొని యిండ్లకు బయలు దేఱుటయు క్షణములో జరిగెను.

# 13

సాజీని వెంటఁబెట్టుకొని మల్లాజీ యిల్లుసేరెను. బండి వచ్చుచున్నధ్వని చెవిఁబడినంతనే దీపాబాయి గుమ్మములోని కెదురువచ్చినది. సాజీని చూచి, ''బాగున్నది? మన చిట్టి బాబుపై నింతగ వసంతము చిమ్మినవా రెవరు? గొప్పవిలువ గల క్రొత్తబట్టలని తెలియదు కాఁబోలు! ఐనను, అందముగ నుంటివిలే బాబూ! హోళిపండుగ బాగుగ జరిపితివి లే,''

అనెను. మల్లాజీ యాలోచనలో మునిఁగి బయలుపల్కకుండ లోనికిఁ బోయెను. పిమ్మట దీపాబాయి వెంట నంటి, "ఏమి జరిగినది? ఏదియో దీర్ఘముగ ఆలోచించుచున్నారు?" అని యడిగెను.

మల్లా: (మందహాసముతో) జరుగవలసినదే జరిగినది!

దీపా : అర్థము?

మల్లా: అర్థమా? ఔను. ఇప్పటికి జరిగినది అర్థము, ఇంక జరుగవలసినది అర్థము.

దీపా : ఆ అర్థముల యర్థమేమి యనియే నేనడుగుట. వివరముగ తెలుపుఁడు. జరిగిన సగమేమియో మీరు చెప్పినచో, జరుగవలసిన సగమేమియో నేనే చెప్పుదును.

మల్లా: అయినచో చెప్పుము చూతము. షాజీపై వసంతముఁ జల్లినది జిజీబాయి.

దీపా : కావచ్చును. పిల్లలు ముద్దుగ వసంతముఁ జల్లుకొన్నచో ముచ్చటగ నుండి యుండును. అందుకా యింతగ మురియుచుంటిరి? అయినచో నిందు సగము జరుగుట యేమున్నది? షాజీ జిజీపై వసంతముఁ జల్లుటయేనా తక్కిన సగము? ఆ పనిని షాజీ యపుడే చేసియుండునే? వసంతము చిక్కలేదేమో?

మల్లా: కావలసినంత యచటనే యున్నది.

దీపా : క్రొత్తచోటగుటచే భయపడెనేమో?

మల్లా: ఉండుండుము. ఆమాట భోన్స్లాల యింటిచీమకైన

నుండదు ; ఉండరాదు.

దీపా : మఱి యేమందురు?

మల్లా: షాజీ జిజీబాయిపై చక్కఁగ వసంతము చల్లినాఁడు.

దీపా : అయినచో నిఁక నేమి? నే ననినట్లు అంతయు పూర్తిగ జరిగినదికదా? ఇంక సగము జరుగవలసి యున్న దంటి రేమి?

మల్లా: వసంతముఁ జల్లుకొనుటవఱకైనది సగముకాదు, సగములో సగముమాత్రమే. అంతమాత్రమే యైనచో ఇంతగ చెప్పుకొను టెందుకు?

దీపా : మఱి?

మల్లా: జిజీబాయి షాజీలు వసంతముఁ జల్లుకొనుట చూచి 'ఈడు జోడు బాగున్నది. వీరు ఆలుమగ లైన నంద ముగ నుండును' అని యాదవరా వనినాఁడు.

దీపా : అందమైన పిల్లలను చూచి ఆనందముతో అతఁ డట్లని యుండును. కాని, అట్లు జరుగవలెనని యనియుండఁడు. అంతటివాఁడు మనతో వియ్యమందుట కిష్టపడు ననుకొంటిరా?

మల్లా: ఇష్టపడుననుకొనుట మాత్రమే కాదు; తప్పక ఇష్ట పడవలెనని యచట చేరినవారి యందఱముందఱ గట్టిగఁ జెప్పితిని. గౌరవనీయులు మాట తప్పుట తగదనియు ఖండితముగఁ బల్కితిని.

దీపా : ఎట్టెట్టా? మంచిపని చేసితిరి. ఐన, అతఁడే మనెను?

తక్కిన వారేమనిరి?

మల్లా: ఎవరేమనఁగలరు? ఏమియు ననలేదు. యాదవరావు ముఖభావమునుబట్టి నామాట లతనికి రుచించలేదని గ్రహించితిని. తక్కినవా రేమనుకొనిన నేమి? ఎట్లయినను యాదవరావుతో వియ్యమందవలసిన దే! మన షాజీకి జిజీబాయియే భార్య కావలెను. అగును, ముమ్మాటికి నగును.

దీపా: మంచిది; కానిండు. యాదవరావుగారి యల్లుఁడనిపించు కొను నదృష్టము షాజీకి కల్గినచో మనము ధన్యులమే! అంతటి మంచిరోజు ఎపుడు కల్గునో?

మల్లా: ఎపుడైనను కలుగవచ్చును. కల్గును. కొద్దికాలములోనే కల్గును; లేనిచో ఈ నాఁడీ సంఘటన మీా విధముగ జరిగియే యుండదు.

దీపా: ఔను; మీారన్నదియు నిజమే! అంతటి శుభము కలుగవలెననియే నా కోరిక.

మల్లా: బాగున్నది! ఇంతలోనే నాకోరిక నీకోరిక యైనదా యేమి?

దీపా: భేదమెఱుఁగను లెండు!

మల్లా: ఎఱుఁగనన్నచో ఉన్నదని సూచించుటేనా?

దీపా: చాలులెండు మీా తర్కశాస్త్రము! అదిగో వంటలక్క పిలుపు; వడ్డన యైనదఁట.

మల్లా: సరి, పద. సుల్తానుగారి యాజ్ఞకైన నొకప్పుడు సుస్త్రీ

జరుపవచ్చును. కాని, వంటలక్కల విషయమున వాయిదా కూడదు.

# 14

'నిజమున కది యోగమే. కాకేమి? యాదవరావుతో వియ్యము సామాన్యమా? సామాన్యుఁడనగు నాకదియోగమే! కాని, సంభవమా—అనునదియే ప్రశ్న. యాదవరావు గొప్ప యైశ్వర్యవంతుఁడు; పెద్ద జాగీరుదారు. సుల్తానుగారికి ముఖ్యుఁడు. ఆయనవలె భోగ మనుభవించుటకైనఁ జాలిన వాఁడు. నాతో వియ్యమున కంగీకరించునా? అంతటివాని తోడనా నేను చుట్టఱికముఁ గోరుట! ఔను. అంతటి వాఁడగుట వలననే నేను వియ్యముఁగోరుట. అతఁడు సామాన్యుఁడే యైనచో నే నింతగ ఆలోచింపవలసిన పని యేమున్నది? "షాజీ యింకను బాలుఁడు; వానికిపుడేమి పెండ్లి?"—అని యెవరైనను ప్రశ్నింపవచ్చును. "పెండ్లి యెపుడైనను జిజీబాయి నిచ్చుటకు యాదవరావు సమ్మతించినఁ జాలును. ఆయన యంగీకారముమాత్ర మిపుడే జరుగవలెను"—అని చెప్పెదను. ఈ సమాధానము నెవరికైన నచ్చఁజెప్పఁగలను. ఎవరి సంగతియో యిపుడేమి వచ్చినది? ముందు యాదవరావుమనసు కుదురవలెను. అతఁ డిష్టపడినచో, అంతయుఁ

జక్కఁబడినట్లే. ఆతనిమాటను కాదనువారు, కాదనఁగల వారు నుండరు. కాదని యెవరేమి సేయఁగలరు? కావలెనని యతఁడు పోజీకి తన కూఁతు నిచ్చుచో వలదనఁగల మేటి యెవఁ డుండును? చుట్టములైనను; హితులైనను శుభకార్యమని చూడ రావలసినవారే; కాని, యితరమేమియు చెప్పఁగల వారు కారు. చెప్పరు.

'సరి బాగున్నది! తొలుత యాదవరావుమాట నిశ్చయము చేసికొనవలెను. ఆనాఁటి ముఖభావమునుబట్టి చూచి నచో అతఁడిష్టపడఁడని తోఁచక తప్పదు. కాని, యిష్టము లేనివాఁడైనచో ఖండితముగ ఆనాఁడే చెప్పియుండునుకదా! నే నందఱకుఁ దెలియునట్లు స్పష్టముగఁ జెప్పినను, అతఁడు మాటలాడలేదు. 'మౌన మర్ధాంగీకార' మందురు. కావున, నామాట కతఁడు కొంతవఱకు సమ్మతించినట్లే!

'కాదు. యాదవరావున కిష్టము లేదు. కావుననే, నాఁడు కనుబొమలు చిట్లించెను. నామాట నచ్చినచో నగు మొగము పెట్టియుండెడివాఁడే. అట్లు జరుగలేదు. అందఱ ముందఱ కాదని చెప్పినచో నామనసు చిన్నఁబోవునని మిన్న కుండెను. అతఁడు లౌకికుఁడు. నాఁటికి నాగౌరవమును రక్షించెను. పిమ్మట నేమైన నాయె. మాటాడని వాఁ డంగీకరించెననుట అర్థములేని మాట.

'ఔను! ఆనాఁ డతఁ డంగీకరింపలేదు. కావుననే యిపు డంగీకరింపఁ జేయవలయును. ఆనాఁడే యంగీకరించినచో

నే నింతగ ఆలోచింపవలసిన పని యేమున్నది? ఈ పాటికి పిల్లున పెండ్లిపందిళ్లను వేయించుచుండెడివాఁడను.

'అసలు నాకెందు కింత పట్టుదల? ఈయ నన్నవాని బిడ్డ నిమ్మని బలవంత మెందుకు? బలవంత మేమున్నది? అతఁ డనిన మాటను చెల్లించుకొమ్మనియే కదా నే ననుట? భావ మతనిది. తొలిపలు కతనిది. పలికిన మాటను చెల్లింపుమని పట్టుపట్టుటయే నావంతు. మాట చెల్లినచో నిర్వారకు మాన్యత హెచ్చును. అన్నిటికంటె ముఖ్యముగ హాజీయున్న తికి మార్గమేర్పడును. తనయుని మేలుకంటె తండ్రి కోరఁదగిన దేమున్నది? హాజీశ్రేయము గోరుట నావిధి. నావిధిని నెఱ వేర్చుకొనుటలో లోపము జరుగనీయను. ఫలిత మనుకూల ముగ నుండకపోదు. ఇపుడే యాదవరావునకు కబురంపి యతఁ డేమి నిశ్చయించుకొనెనో తెలిసికొందును. ఆపై జరుగవల సిన పనినిఁగూర్చి యోజింతును'—అనుచు మల్లాజీ యొక నాఁటి మధ్యాహ్నము వ్రాతఁబల్లముందు గూర్చుండి, బల్లపై నున్న కాగితముల నటునిటు ద్రిప్పుచు, ప్రక్కనుంచుచు, ఆలోచించుచుండెను.

"కాగితములకట్ట లెంతకును గదలకున్న వేమి? ఆలో చనల కంతు లేనట్లున్నది!" అనుచు దీపాబాయి వచ్చెను.

మల్లా: ఉన్నది, లేనిది తెలియకున్నది. తెలియఁ జెప్పఁగల దాన విపుడు నీవే! 'కార్యేషు మంత్రీ...' అను హోదాను మీా కేనాఁడో పెద్దలే కట్టఁబెట్టిరికదా?

దీపా : ఏనాఁటి మాటయో యిప్పు డెందుకు ? ముం దీనాఁటి మాట చెప్పుఁడు.

మల్లా: ఇంతమాత్ర మూహింపఁజాలవా ? పాజీ సంగతియే !

దీపా : ఏమి, యాదవరావునుండి వార్త యేమైన వచ్చినదా ?

మల్లా: వచ్చినచో నింక యాలోచనచేయవలసిన పనియే ముండును ?

దీపా : రానిచో ఆలోచనవలనఁ బ్రయోజనమేమి ?

మల్లా: రానిచో రప్పించుటకు.

దీపా : వచ్చినచో వైభవముగ పెండ్లి జరుపుటకు.

మల్లా: వియ్యపురాలి హోదా నీకపుడే వచ్చినట్లున్న దే ?

దీపా : మీకు వియ్యంకుని హోదా రానట్లా ?

మల్లా: ఏమైనను ముందు వియ్యపురాలికే పెద్దపీఁట !

దీపా : వియ్యంకునకు మీకు పెద్దవిస్తరి వేయుఁడని చెప్పె దను లెండు !

మల్లా: ఇంకను పెండ్లి కుదురలేదు–నీకపుడే పీఁటలు–విస్తళ్ల ప్రస్తావన ! ఎంత బాగున్నది !

దీపా : అంతయు బాగున్నది. లేకేమి ? ముందు మీరు పీఁట లంటిరి ; వెనుక నేను విస్తళ్లంటిని. పీఁటలవెంట విస్తళ్లు వచ్చుట సహజమే కదా ?

మల్లా: అది సహజమే ! కాని, యింతకును యాదవరావు స్పష్టముగ అంగీకరింపకుండుట మాత్రము అసహజ ముగ, అసాధారణముగ నున్నది. ఆయనకు కబురంపఁ

దలఁచుచున్నాను. నీ వేమందువు ?

దీపా : నే ననుట కేమి లెండు! మీరే తిన్నగ ఆలోచించుఁడు. 'మీ పిల్లను మా పిల్లవాని కీయుఁడు' అని మనము సూటిగ కబురంపుట చుల్కన యగునేమో ? అని నా యనుమానము.

మల్లా : ఔను ; అదియును కొంత నిజమే. అట్లయిన నాయన మనసును తెలియుటెట్లు ? మనము మిన్నకున్నచో ఆయనయు మిన్నకుండునుగదా ?

దీపా : సూటిగ కబురంపవలదంటిని. కాని, కథ నడుపవల దంటినా ?

మల్లా: అదెట్లు ?

దీపా : కొన్నాళ్లు ఆయన భవనమునకు వెళ్లుట మాని వేయుఁడు! 'ఏల వచ్చుట లేద'ని అడుగుట కాయన యెవరినైనను పంపకమానఁడు. అపుడే చెప్పవచ్చును. దానితో అంతయుఁ దేలును.

మల్లా: బాగున్నది! అట్లే చేయుదును.

దీపా : (నవ్వుచు) 'అట్లే' చేయుదురో, పాకమే పట్టుదురో మీయిష్టము. రుచిగ తయారైనచో తినుటకు నేను కూడ వచ్చెదను లెండు!

అనుచు దీపాబాయి లోని కేఁగుటతో మల్లాజీ ముందున్న కాగితపు కట్టలు మఱల కొంచెము కదలఁజొచ్చెను.

# 15

'మల్లాజీ నేమనవలెనో తెలియకున్నది. నాయింటికి వచ్చుటయే మానుకొనెను. కారణమేమియో తెలిసికొనవలె నని కబురంపినాఁడను. షాజీకి జిజీబాయి నిచ్చి పెండ్లిచేయుటకు ముందుగ నేను ఒప్పుకొనినఁగాని తాను నాయింటికి రానని జవాబు పంపినాఁడు. వింతప్రకృతి! అతఁడు నాయింటికి రాకపోయినచో నాకేమో లోటు కల్గునని తలఁచినాఁడు కాఁబోలు! హితుఁడని సమాచారముఁ దెలిసికొనుటకు కబురంపినాఁడను! ఇట్టి సమాధానము వచ్చు ననుకొనినచో కబు రంపెడివాఁడనా? ఉద్యోగమును సంపాదించుటకు నన్నాశ్రయించిన రోజులను మఱచినాఁడేమో? లేకున్నచో, ఇంత బిగువుగ సమాధాన మంపునా? 'ఏఱుదాఁటి తెప్పఁ గాల్చుట' అన నిట్టిదేకదా? నాతో అవసర ముండినపుడు పిలువకయే మాటిమాటికి వచ్చెను. నాతో ఆయన కిపు డవసరము తీరినది. అంతస్తు పెరిగినది. గర్వము వచ్చినది. కానీ, ఆయనతో నాకేమి పని! నేఁటికిని అతఁ డెంతవాఁడైనను నాతో సమానుఁ డెట్లగును? సమానుఁడు కానివాఁడు సంబంధముఁ గోరుట సమంజసము కాదు. అతఁడు గర్వముఁ జెందె ననుట కిదియే తార్కాణము. అట్టివానినిగుఱించి యింతగ నాలోచించుటయు ననవసరమే.

'కాదు. మల్లాజీని అనవసరముగ నిందించుచున్నాను.

అతనిపై నాకు కోపమెందుకు ? అతఁ డేమి తప్పుచేసెను ? అతఁ డాడిన మాటకు మొదట అవకాశము గల్గించినది నేను. ఆ యవకాశము నుపయోగించుకొనుట కతఁడు ప్రయత్నించెను. మంచి యవకాశమున్నపు డుపయోగించుకొనని వాఁడు వెఱ్ఱివాఁడు. ఇంతకు నతఁడు కోరిన దేమి ? తనకొడుకునకు మంచి సంబంధము దొరకవలె ననియేకదా ? దానిలో అక్రమ మేమున్నది ? నేను తమాషాగ అనినమాటను నిజమని నమ్మి అది జరుగవలెనని పట్టుపట్టెను. నే ననకుండిన–అతఁడచట లేకుండిన–ఆనాఁడు హోళీ కాకుండిన ఇంత జరుగదు కదా ? అనవసరముగ ఆశగొల్పి, యిపుడు కాదనుట నా దే తప్పు. కాదనువాఁడను ఆమాట నపుడే ఖండితముగ చెప్పివేసిన చో నింత దూరము రాకుండెడిది కదా ?

'ఔను. జరిగిన దేమో జరిగినది. పండుగ సమయమున పదిమంది ముందఱ పలికినమాట, కాదనుటకంటె, ఔననుట వలన నే గౌరవము హెచ్చును. మల్లాజీకి తృప్తి కల్గును. షాజీ చక్కనివాఁడే. గుణవంతుఁడు. చుఱుకైనవాఁడు. భోంస్లాలన్న పేరెన్నికఁగన్నవారే. మల్లాజీ గౌరవనీయుఁడే. కొద్ది కాలములోనే సుల్తానుగారి మనసుకెక్కఁగల్గినాఁడు. అతఁడు మున్ముం దింకను ఉచ్చదశనొందుట కవకాశము లేకపోలేదు. ఇఁక, నేను కాదను టేల ? సరియే అని కబురంపుదును.

'కాదు. కూడనిపనికి మనసును సరిపెట్టుకొను

ఎందుకు? విషయము వివాహము. శాశ్వతముగ నిలిచిపోవు సంబంధము. ఇద్దరు వ్యక్తుల జీవితములకు – రెండు వంశముల పేరు ప్రతిష్ఠలకు సంబంధించిన పెద్దసమస్య. పూర్తిగ ఆలోచింపక, పరిష్కారము కూడదు. ఇపుడు తొందరపడినచో, తరువాత పశ్చాత్తాపము నొందవలసి యుండును. ఏమైనను, ఇపుడే సరిగ నాలోచించి యొక నిర్ణయమునకు రావలెను.

'లేదు, ఇంకను ఆలోచింపవలసిన అవసరము లేదు. మల్లాజీకిని నాకును వియ్యమా? జరుగదు. అతడు నా కేవిషయమున సాటి? మల్లాజీకి వంశగౌరవముతో బాటు నాకు దీటుగ ఐశ్వర్య ముండినచో ఆలోచించెడివాడను; కాని నెడి వాడను. అవి లేనిది ప్రయోజన మేమి? ఇక ఆలోచన లేదు. మల్లాజీ యాశ నిరాశ. అతని పట్టుదల వృథా. జిజీబాయిని షాజీ కిచ్చుట కల్ల. స్పష్టముగ చెప్పివేయుదును. మల్లాజీ నాయింటికి రాకున్న మానె! ఎవ రేమన్నను నామాట కిక తిరుగు లేదు. ఇది నానిశ్చయము'—అని యొకనాడు యాదవరావు నిశ్చయించుకొనెను. అట్లే మల్లాజీకి కబురంపెను.

# 16

"అయిననేదట! పిల్లనీయనని మల్లాజీకి స్పష్టముగ తెలియ జేసినాడట యాదవరావు!"

"లేని వెఱ్ఱి కాని, మల్లాజీకి యాదవరావుతో వియ్య మేమిటి ?"

"అసలు వియ్యానికి కయ్యానికి ఉజ్జీలు సమానముగ నుండవలెను."

"మల్లాజీపని 'కొండకు నాఁగలిని మోటించిన'ట్లైనది."

"ఇంతపని జరుగునని నే నానాఁడే చెప్పితిని."

"క్రొత్తసంబంధము కుదురకపోగా, ఈ పట్టుదలల వలన వారి ప్రాఁత స్నేహము పాడైనది."

"యాదవరావుజీ సాయమువలననే దివాణమున మల్లాజీ కీపాటి మాన్యత కల్గెనందురు కదా ? మల్లాజీకి విశ్వాస మేల లేకపోయినదో ?"

"మల్లాజీ అన్నివిధముల నర్హతయున్నవాఁ డగుట చేతనే సుల్తా నభిమానము చూపెను. కేవలము యాదవ రావుమాటవలననే మల్లాజీకి దివాణములో స్థానము కల్గె ననుకొనరాదు."

"మల్లాజీ చేసిన తప్పేమి ? యాదవరా వొకమారు మాటసాయము చేసెనని కలకాల మాయనను కాదనక నడచుకొనవలెనా యేమి? తొలుత యాదవరావు సూచించ కుండినచో మల్లాజీ మాటాడకుండెడివాఁడే కదా !"

"మల్లాజీ కోర్కెను మన్నించకపోవుట యాదవ రావునకు మాత్ర మేమి గౌరవము ? కేవలము డబ్బును ప్రధా నముగ చూడరాదు. మల్లాజీయు కలవాఁడే కదా ? ఐనను,

డబ్బునకు మిత మెక్కడ ? సరితూఁగుటనినచో పావులవఱకు-వీసముల వఱకు లెక్కగట్టుటేమి భావ్యము ?''

''తనకంటె గొప్ప యైశ్వర్యవంతుఁ డెవఁడైన తనతో సంబంధము చేయనెంచినచో యాదవరావు సంతోషముతో సమ్మతింపకుండునా ? అవకాశమున్నచోఁ దనకంటె గొప్పవానితో సంబంధము చేయుటకు మల్లాజీ ప్రయత్నించుటలో తప్పేమి ?''

''ఈడు జోడు చక్కఁగ సరిపోయిన పిల్లలకు పెండ్లి చేయుటయే మేలు. ఆస్తిపాస్తులను తూకము వేసికొనఁ జూచుటేమి బాగుండును ?''

''పిల్లవాని కాస్తి చాలదనుకొన్నచో గొప్ప యరణ మీయవచ్చునుగదా యాదవరావు ?''

''ఇంతకును ఆ పిల్ల లిద్దరు నాలుమగలగు యోగ మున్నచో, యాదవరావు తప్పింపఁగలఁడా? లేనిచో, మల్లాజీ తెచ్చి పెట్టఁగలఁడా ? ఏమగునో చూచుచుండుట మాత్రమే మనము చేయఁదగినది.''

''ఏమైనను, జిజీబాయి, షాజీలకు పెండ్లి కుదురునా?''

''ఏమో ! యాదవరావు సమ్మతింపకుండుట మర్యాద కాదు !''

''ఇంతకును, మల్లాజీ పట్టుదల మంచిది కాదు.''

''అదికాదు, ఇదికాదు. ఎవరేమన్నను, ముందు పెండ్లి జరుగుట యన్నిటికంటెను మంచిది. ఏమైనను, గొప్పవారింటి

పెండ్లి కదా? విందులు, వేడుకలు బాగుగ జరుగును."

"హోళీనాఁడు జరిగినమాట ఏమగునో? హోళీ మాహాత్మ్య మెట్లుండునో?"

"పిల్లల యాఁటలలో నేర్పడిన పెండ్లి ప్రస్తావన-ఎంత వఱకు ఫలించునో?"

"పట్టుదలలో ఇద్దఱు నొకటే; చివర కేమగునో చూడవలెను"—అనుచు విషయ మెఱిఁగినవా రందఱు యాదవరావు–మల్లాజీలనుగుఱించి పలురీతులుగ పలుకఁ జొచ్చిరి.

# 17

"కథ యడ్డము తిరిగినది!" అని యాదవరావు పంపిన కబురు విన్న దీపాబాయి విన్నఁదనమున, తిన్నగ భర్తతో నన్నది.

"ఇప్పటి కంతియే!" అనుచు ముఖము ద్రిప్పి మల్లాజీ దూరముగ దృష్టి సారించెను.

భర్త కింకను ఆశయుండుట కాశ్చర్యము చెందినదై దీపాబాయి తన యభిప్రాయమును వెల్లడించినది :

"ఎప్పటికి నంతియే" అని.

"కాదు, కారాదు" మల్లాజీ మాటలలో దృఢ

సంకల్పము తొంగి చూచినది. గొంతుక జీరపట్టినది. అతఁడు దీర్ఘముగ నిట్టూర్చెను. తల పంకించెను. మరల పల్కెను:

"జిజీబాయియే షాజీభార్య" అని.

దీపాబాయి నలువంకలఁ గలయఁజూచెను. క్షణ మాఁగి, యిటులనెను :

"మీరేమో సులభమని యెంచుచున్నారు. పంతమేవరితోడనో పూర్తిగ నాలోచించినచో మీరిట్లనరు. జిజీబాయి తంగేటిజున్ను కాదు." తానంతయుఁ దఱచి, సారాంశమును తేల్చి చెప్పివేసినట్లు దీపాబాయి సూటిగ చూచెను. భర్తనుండి బదులేమి వచ్చునో యనుకొనుచున్నట్లు ముఖములో తొందర చూపెను. మల్లాజీ నిశితముగ పల్కెను :

"జిజీబాయి పెండ్లికూఁతురు కానిచో షాజీకి పెండ్లియే చేయను" అని.

దీపాబాయి కలవరపడెను. గబగబ పల్కెను :

"వద్దు, వద్దు, మీ శపథములు వద్దు. మీ పంతములతో, పట్టుదలతో షాజీసౌఖ్యమునకు అడ్డు కల్పింపవద్దు. జిజీబాయివంటి బాలికలు, యాదవరావువంటి భాగ్యవంతులు వేనవేలున్నారు. వారు కాదని రన్న కసిని షాజీపై రుద్దవద్దు. నామాట వినుఁడు. వారిమాట మఱచుట మంచిది. ఆ ప్రస్తావనయే వలదు. నేను తలఁపునకు తేను. మీరును ఆలోచింపనువద్దు. అన్నివిధముల మన కిదియే క్షేమమగును" అని.

మల్లా: అన్నివిధముల పాజీ కదియే క్షేమమగును. యాదవ రావుతో సంబంధమే పాజీ యున్నతికి మార్గము. కావుననే, నే నింతగఁ బ్రయత్నించుట.

దీపా : ఫలించదని తెలిసిన ప్రయత్నమును-కాదు; ఫలింపక పోయిన ప్రయత్నమును విడుచుటకన్న చేయఁదగిన దేమున్నది? చెల్లని శపథము లెందుకు?

మల్లా: ఔను; చెల్లనివానిని-చెల్ల వనినవానిని చెల్లించుట లోనే విశేషమున్నది. సులభముగ చెల్లుబడియగు మాటలకు, అనుకొనినంతనే నెఱవేఱు పనులకు ప్రత్యేక ప్రతిభ యనవసరము.

దీపా : ఏమో, మీ ప్రత్యేకత మీకే తెలియవలెను! ఏమైనను, పాజీ విషయమున ఇంతగా 'రాద్ధాంత సిద్ధాంతము'లగుట బాగులేదు. ఈ విషయ మపుడే యూరెల్ల పొక్కినది. అందఱినోట పాజీమాటయే! పసివాని కింత ఉప్పతి యెందుకని నా యాందోళన.

మల్లా: విషయము నలువురనోటఁ బడినది; నిజమే! కావుననే, మనకు తప్పక అనుకూలముగ జరుగునట్లు ప్రయత్నించవలెను. నాపట్టుదల కిది మఱియొక కారణము. ఈ విషయమున నెగ్గనిచో నా గౌరవమునకు తీరని మచ్చ కల్గును. అది నేను సహింపఁజాలను.

దీపా : లేనిపోని భావములతో 'గోరంతలు కొండంతలుగ' చేయుచున్నారు! తుదకేమగునో?

మల్లా: ఏమగును? జిజీబాయి షాజీభార్య యగును.
దీపా : 'ఎవరిపిచ్చి వారి కానందము' అన నిట్టిదే.
మల్లా: ఆమాట అందఱివిషయమునను చెల్లును సుమా!
దీపా : కానిండు; మీతో వాదన నాకెందుకు?
మల్లా: నీవాదన లేకున్న నా ప్రతివాదనయు లేదు.

"మంచి రాజీయే" అని దీపాబాయి పలుకుచుండ, "రాజీయే; కాక, రమణీమణులతో రగడ తగునా?" అనుచు మల్లాజీ నవ్వెను.

# 18

"తెచ్చితిని. తెలిసికొంటిరా?" అన్నది, ముక్తాబాయి పూవులు గ్రుచ్చుచు, భర్త దిగంబరరావుతో.

"మెచ్చితిని. వింటివా?" అనినాఁడు, ముక్తసరిగ, ఎత్తుకెదురెత్తుగ, దిగంబరరావు.

ముక్తా: మెచ్చిన దేమిటి?
దిగం : తెచ్చిన దేమిటి?
ముక్తా: ఒక మాట.
దిగం : ఒక పాట.
ముక్తా: మాటకు మాట! బాగున్నది! ఇది యేనా? విషయమును చెప్పరా?

దిగం : 'ఇక్కడినుండి యక్కడికెంతదూరమో, అక్కడినుండి యిక్కడికి నంతియే దూరము' అని తెలియవా ?

ముక్తా: ముందు నేనుచెప్పవలె ననియేకదా మీరనుట ?

దిగం : కాక ?

ముక్తా: ఆమాటను మొదటనే చెప్పరాదా ? ఎందుకీ 'డొంక తిరుగుడు' ?

దిగం : నీమాట ముందుగనే చెప్పక త్రిప్పినది నీవు.

ముక్తా: నేను తెచ్చిన మాట-దీపాబాయి మాట !

దిగం : నేను మెచ్చినపాట-మల్లాజీపాట !

ముక్తా: చిలుక జాతిపోయినదని దీపాబాయి చింత.

దిగం : చిలుకతోఁబాటు చెట్టుకూడ వచ్చునని మల్లాజీ యుల్లాసము.

ముక్తా: పైకి బింకముతో నున్నది. కాని, జిజీబాయి తనకు కోడలు కాఁబోదని దీపాబాయి చిక్కి సగమైనది !

దిగం : కాఁదట ! 'దేశము గొడ్డుపోయినదా ? కో - అనిన కోటిమంది. మనకు కోడలు రాకపోవునా? జిజీబాయి కంటె అందకత్తె లేకపోవునా ? వారి ప్రస్తావనయే వద్దు'-అని మల్లాజీతో అనుచున్నదఁట.

ముక్తా: 'పెండ్లియైనవాఁడను. సీత నాకెందుకు ? లేకున్న, శివధనుస్సు నెక్కిడ లేకపోదునా ?' అని, పూర్వము మిథిలలో రావణుఁ డనెనన్న మాటను తలఁపునకుఁ దెచ్చుచున్నది దీపాబాయిపోకడ.

దిగం : అదియే కాదు. తాను వలదనిన కోలంది మల్లాజీపట్టు బిరుసెక్కు నని యుం దలంచిన దేమో?

ముక్తా: కావచ్చును. ఇదమిత్థమని యెట్లు చెప్పంగలము?

దిగం : ఏమో, నీకు స్నేహితురాలు కదా! ఆంతర్యము చెప్పి యుండు ననుకొంటిని.

ముక్తా: మిత్రులకు మన ముపకార మొనర్పంగల స్థితిలో నున్నచో వారన్నియు చెప్పెడివారే. లేనపుడు, ఏమి చెప్పినను వారికి కంఠశోషణయే మిగులును.

దిగం : పోనిమ్ము. మిత్రురాలికిం గొంచెము సాయము చేసి సంతోషముం గల్గింపలేకపోతివా?

ముక్తా: మీ మిత్రునకు మీరు సాయము చేసినచోం జాలును. భార్యాభర్తల కిర్వురకును జిజీబాయి నెటులైన కోడలుగ పొందవలెనని యున్నది.

దిగం : అట్లు జరిగినచో వారికంటె ముందు మిక్కిలిగ నేను సంతోషింతును.

ముక్తా: మీసంతోషముతో నాసంతోషమును జతపఱచుదును లెండు. అయినచో సంతోషము పొంగి పొరలి గంతులు వేయరుకదా?

దిగం : గంతులు వేయుటేమి? నాట్యమే చేయుదును.

ముక్తా: అపుడేమి చేయుదురో తరువాత చూచెదము. ఇపుడు చేయందగిన దేమైననున్న చేయుండు.

దిగం : ముక్తా! ఎటులంగని దానివలె అడిగెదవేమి? ఏమి చేయం

గలము? ఎవరికి చెప్పఁగలము! పట్టుదల విడువు మనిన మల్లాజీ వినఁడు. అతని కోర్కెను తీర్పుమన్న యాదవ రావు వినఁడు.

ముక్తా: నిజమే. సుల్తాను జోక్యము గల్పించుకొనినఁగాని యీ వ్యవహారము చక్కఁబడదు.

దిగం: చక్కఁగ చెప్పితివి. బృహస్పతిబుద్ధిని పుణికి పుచ్చు కొనినట్లు మాట్లాడితివి.

ముక్తా: వందిమాగధులకు దివాణమునందుఁగాని, సామాన్యుల యింటిలో స్థానము లేదుసుఁడీ!

దిగం: ఔను సుమీ!

ముక్తా: మఱి యెందుకా పొగడ్త? ఔననియో, కాదనియో పల్కనఁ జాలదా!

దిగం: పొగడ్త యేమున్నది? నీమాటకు విలువఁగట్టితిని.

ముక్తా: మాటకేగదా? అంతటితో సరిపెట్టితిరి; మేలు!

దిగం: మాటకే కాదు, నీ చేతిలోని మాలకును!

ముక్తా: మాలకా? ఏమి వెల?

దిగం: చూచికదా చెప్పుట?

ముక్తాబాయి "ఇదిగో, చూడండి" అనుచు తాను గ్రుచ్చుచున్న పూలదండ నందీయ "ఇది నాది. ఇంక వెల మాటలేమి?" అనుచు దిగంబరరావు దండసొగసునకు మురిసిపోయెను.

# 19

"అపుడే అలంకరణమైనదే! సుల్తానుగారి దర్శనమునకు మురియుచు పోవుచున్నారు! అతఁడేమనునో, యెందుకు పిలిపించుచున్నాఁడో?" అని యొకనాఁడు పిలుపు వచ్చుటచే అహ్మదునగర సుల్తానును దర్శించుటకు బయలుదేఱనున్న భర్త నుద్దేశించి పలికినది దీపాబాయి.

మల్లా: 'కుడువఁబోవుచుఁ గూరల చవు లడుగనేల?' సుల్తానుగారు నాకువలెనే యాదవరావునకుఁగూడ కబురంపిరి. మమ్మిర్వురను ఒకే సమయమున తన్ను చూడరమ్మనిరి. మా యిర్వురకును స్నేహము చెడెనని ఆయన వినెను. మేమిర్వుర మెప్పటియట్లు స్నేహముతో నుండవలెనని యాయన సూచించుననుకొందును.

దీపా : సూచించుట కాదు, ఆజ్ఞాపించును.

మల్లా: సుల్తాను విశాలహృదయుఁడు. ఉండెనని అధికారమును దుర్వినియోగము చేయఁడు. మంచితనమున మర్యాదగ మాటాడి పనులు జరిగించుట ఆయనకు బాగుగ తెలియును.

దీపా : అధికారిమాట–'సలహా' అన్నను, 'సూచన'అన్నను, 'అభిప్రాయము' అన్నను—అది దాటరాని ఆజ్ఞయే అనుకొనవలెను. సుల్తానుగా రీవిషయమున ఏమి చెప్పినను సమ్మతింపక తప్పదు కదా?

మల్లా: కావచ్చును. అతఁడు మన కనుకూలముగ చెప్పినచో
ఒప్పుకొనుటకు కష్టమేమి ?

దీపా : మన కనుకూలముగ ఎట్లు చెప్పఁగలఁడు ? ఇష్టములేని
యాదవరావును పిల్లనిమ్మని బలవంతము చేయునా ?
మిమ్మే మందలించును. ఈ విషయములో పట్టుదల
తగదనును. తనమాట వినక తప్పదని హెచ్చరించును.
ఇచ్చువారు, పుచ్చుకొనువారు సంతోషముతో జరి
గించిన పెండ్లి రాణించును; గాని, ఏపక్షమువారిని
కూడ బలవంతమొనర్చుట పనికిరా దనును. ఆయన
యట్లనినచో మీరేమి సమాధాన మీయఁగలరు?
ఆయనమాట నెట్లు కాదనఁగలరు ? కాదని, ఏమి
చేయఁగలరు ?

దీపాబాయి మాటలలో నిజము లేకపోలేదని మల్లా
జీకి తోఁచెను. అతఁడు కొంచెముగ తల యూఁచెను. ఊఁచి
నలువైపులఁ జూచెను. చూచి నిట్టూర్చెను. ఊర్చి కొంచెము
సేపు కూర్చుండెను. కూర్చుండి యాలోచనలోఁజిక్కుకొనెను.
చిక్కుకొని యంతలో ధైర్యముఁ దెచ్చుకొనెను. మోము
విప్పారెను. కనులు కాంతు లీనెను. స్ఫుటముగ నతఁడనెను:

"అల్లైన్నటికిని కాదు. సుల్తాను యాదవరావునకు
ఎక్కువ గౌరవము, నాకు తక్కువ . గౌరవము
నీయఁడు. నాకోరిక యక్రమముకాదని ఆయన తెలిసి
కొనలేకపోఁడు. తెలిసికొనినచోనన్ను మందలించఁడు.

యాదవరావునే ఒప్పించును. అతఁడు సంతో షముతో పిల్లనిచ్చునట్లొనర్చును. ఆయన నిష్పాక్షిక మైన బుద్ధి యీ విధముగ చేయించును. ఆయన యౌదార్యమున కది తప్పని మార్గము''-అని.

మల్లాజీకి బరువు తగ్గినట్లయ్యెను. గొప్ప విజయమును సాధించినవానివలె, 'చూచితివా నాప్రజ్ఞ' అనినవానివలె, అతఁడు దీపాబాయిని తేటి చూచెను.

దీపా : ఔను. న్యాయమెఱిఁగిన సుల్తానుగారు చేయవలసిన పనిని చక్కఁగ సూచించినారు. అట్లే జరుగవలెను. ఆయన యాదవరావునే సమ్మతింపఁ జేయవలెను. అపుడే ఆయనఘనత హెచ్చును. ఏమైనను, ఇఁక మీరు లొంగిపోవద్దు. మీధైర్యమే మీకు జయ మిచ్చును. సుల్తానుగారిమనస్సునకు నచ్చునట్లుమాట్లా డుఁడు. ఆయనతో సరసముగ, సగౌరవముగ, కార్య సాధన కనుకూలముగ విషయ మంతయు విపులముగఁ జెప్పుఁడు. 'ఈ సమస్య తీరుట రెండు పక్షములకు మేలు'-అని, 'మీరు చేసిన మేలుకంటె-ఈ విషయ మును చక్కఁబెట్టుట యెక్కువ కీర్తిప్రద'మనుఁడు. పని జరుగకపోదు. జయము కలుగకపోదు.

దీపాబాయిమాటలు మల్లాజీకి క్రొత్తసత్తువ నిచ్చి నవి. ఆమెకును ధైర్యము వచ్చెనని యతఁ డానందించెను.

మల్లా: సెబాస్, దీపా! బాగుగ చెప్పితివి. మాటకు నూఱు

మాడ లీయవచ్చును. నీమాటలు శుభసూచకములు.

దీపా : ఇచట నన్ను మెచ్చుట చాలదు. అచట సుల్తానుగారిని మెప్పించి, యాదవరావును ఒప్పించి, రండు. అపుడు మీ మెప్పులను కుప్పలుపోసి, మీ మాడలకు వడ్డీ కట్టి, అసలుఫాయిదాలను రెండింట గుణించి, వచ్చిన మొత్తమును ముచ్చటగ ముడుపుగట్టి మీ కిచ్చెదను. ఆలస్య మగునేమో, వెళ్లిరండు.

"గుణవంతురాలవు; గుణకారములను గూడ నేర్చితి వి లే! ఈ నాఁటి నీమాటలు వరాల మూటలు!" అనుచు మల్లాజీ బయలుదేఱెను.

"అయినచో అన్నిటి నెత్తికొని ఒలకపోసికొనక, బరువని దారిలో విడువక, కొనిపోయి దివాణములోదింపి, ప్రతిఫలమును తీసికొని రండు" అనుచున్న దీపాబాయి మాటలు మల్లాజీ బండి సాఁగి మ్రోఁగిన గంటల గణగణలో తొణికిసలాడినవి.

# 20

మల్లాజీకిని యాదవరావునకును కలఁతలు కల్గెనను వార్త సుల్తానుచెవి సోకెను. అది క్రమముగ సమసిపోవునని కొంత కాల మతఁడు మిన్నకుండెను. ఫలితము శూన్యమైనది. తాను

జోక్యము గల్గించుకొనక తప్పదని తలఁచి యతఁడు వారి కిద్వరకు కబు రంపెను.

సుల్తాను పిలుపుతో యాదవరావు, మల్లాజీలు తెక్కలు కట్టుకొనివచ్చి వ్రాలిరి. ఒకరి నొకరు చూచుకొనిరి. మాటాడ లేదు. క్రొత్తవారివలె ముఖములు త్రిప్పుకొని కూర్చుండిరి.

సుల్తాను వచ్చెను. యాదవరావు, మల్లాజీ లేచిరి. సగౌరవముగ వంగి సలాములు పెట్టిరి. కూర్చుండుఁడని సుల్తాను సూచించెను. ఆసీనులైరి. సుల్తాను ఏమనునో యని ఆత్రముతో చూచుచుండిరి.

"అచ్ఛా! అల్లా రక్షించాలి. చూడండి. మీ ఇద్దరిని యిపుడు ప్రత్యేకం పిలిపించాం. ఎందుకో మీకు తెలుసా? మిమ్ముగురించి మాకు సంతోషం కాని మాట ఒకటివిన్నాము. కారణం తెల్సుకొనేటందుకే పిలిపించాము. ఏదో పెళ్లివిషయంలో మీకు మీకు లడాయిగా వుంది అని వింటున్నాము. మీరు ఇద్దరు మంచివారు. మాకు నచ్చినవారు. మర్యాద కల వారు. మీకు మనసు కలిసింది లేకపోవడం మాకు చాలా కష్టంగా ఉంది. మొదట స్నేహితులు, ఇపుడు విరోధం. ఇది మీకు మంచిదికాదు. మాకు ఏమీ నచ్చలేదు. మీమీమాటలు ఏమిటో మాకు మనవి చేస్తే, మేము ఇద్దరికి సమాధానం చేస్తాము. చెప్పండి. ముందు ఒకరు చెప్పండి. తర్వాత ఒకరు

చెప్పండి'' అని సుల్తాను పలికెను.

యాదవరావు మల్లాజీవైపు చూపులఁ బఱపెను. మల్లాజీ యాదవరావుదెస దృష్టి నడపెను. ఒక నిముస మంతయు నిశ్శబ్దము. అటునిటు చూచి, లేచి సలాము చేసి, యాదవరా విటులనెను :

''అహ్మదునగర పాచ్ఛాగారికి మామీఁద దయ యెక్కువ. ఆ గొప్పహృదయములో మాఖోఁటి కొద్ది వారికి స్థాన మిచ్చిరి. కావుననే, మా విషయము నిట్లు ప్రత్యేకముగ గమనించిరి. ఇందుకు కృతజ్ఞులము. పాచ్ఛాగారికి శ్రమ గల్గించినందుకు క్షమాపణ చెప్పుకొనుచున్నాము.

''నామాట ఒక్కటి చిత్తగించవలెను. వెనుక హోళీ పండుగనాఁడు జరిగిన విషయము పాచ్ఛాగారు విని యుందురు.......''

అడ్డుతగిలి సుల్తాననెను :

''అచ్ఛా, అచ్ఛా. అది అంతా విన్నాము. మల్లాజీ కొడుకుకు మీ పిల్లను ఇచ్చేదానికి ఏమిటి సందేహం? మీరు మీరు కలిసేదానికి అంతా సరిగా ఉంది కదా? పిల్లవాడు మంచివాడు. మల్లాజీ మంచి వాడు'' అని.

షుల్తాను పలుకుచున్న మాటలకు మల్లాజీ యొకవంక లోలోపల సంతోషము నొందుచుండెను. యాదవరావు

సమాధానమేమి చెప్పునోయని వేఱొకవంక తహతహలాడు చుండెను.

సుల్తాను సూటిగ ప్రశ్నించుటతో జవాబేమి చెప్ప వలెనా?అని యాదవరావుతటపటాయించెను. సుల్తాను మల్లాజీ కనుకూలముగ మాటాడుచుండెనని కుమిలెను. సుల్తాను వైపు చూచెను. సమాధాన మీయక తప్పదని యిట్లనెను:

"పాచ్చాగారు సెలవిచ్చినట్లే మల్లాజీ వంశగౌరవాదు లకుఁగాని, పిల్లవాని గుణరూపములకుఁగాని లోపము లేదు. కాని-" అని యాదవరావు వాక్యమును పూర్తి చేయక నిలిపివేసెను.

మల్లాజీ యేమియుఁ దోఁచనివానివలె యాదవరావు వైపు, సుల్తానువైపు చూచుచుండెను.

"అచ్ఛా. మాకు అంతా అర్థం తెలిసిపోయింది. మల్లాజీ నీకుమాదిరిగా పెద్ద జాగీరుదారు కాదు అని నీకు సందేహం ఉంది. అది ఒకటే కారణం మీకు మీకుమధ్య పెళ్ళి నిలిచి పోయిందానికి" అని సుల్తాను పలికెను.

ఔనని నట్లు యాదవరావు తల వంచెను.

మల్లాజీ యేమైన మాటాడునేమో యని సుల్తాను పరికించెను. మల్లాజీ మాటాడలేదు. వినయ ముట్టిపడునట్లు చూచెను. సుల్తాను మరల పలుకఁజొచ్చెను:

"అల్లా రక్షించాలి. మీకు ఇద్దఱికి నిండా సంతోషం

అయ్యో మాట చెప్పేదానికి ఉన్నాము. మల్లాజీని రెండు దుర్గాలకు పైని అధికారిగా చేస్తాము. పూనా, సూపా పట్టణాలు జాగీరు ఇస్తాము. ఐదు వేల గుఱ్ఱానికి గూడా అధికారిగా చేస్తాము. ఇది మాదిరిగ ఈరోజే ఫర్మానా వ్రాయించి యిస్తాము. పెళ్ళి నిశ్చయం చేసుకోండి, పోండి. అది మాకు నిండా సంతోషం'' అని.

సుల్తాను పల్కిన పలుకులకు పెల్లుబ్బి, ''చిత్తము'' అని యాదవరావును, ''మహాప్రసాదము'' అని మల్లాజీయును తలెత్తి యొక్కసారుగ పల్కిరి.

వారి మాటలవలెనే మరల వారి మనసులును కలిసెను.

# 21

అవిగో, పెండ్లిపందిళ్లు-వీధులవరకు విస్తరించినవి. ఊరంతయు నలంకారములు!!

అది రఘోజీ యాదవరావు భవనము! పసుపు కుంకుమలు, పచ్చతోరణములు కనులపండువు గావించుచున్నవి. చుట్టములు, హితులు క్రిక్కిఱిసి యున్నారు. సారసాక్షులు ధగధగమను నగల కాంతిలో నిగనిగలాడు పట్టుచీరల పసందు గలుపుచున్నారు. అందముతో ఆనందము చేయిగలిపినది.

యజమానుని యాజ్ఞ పెదవులమీఁదికి వచ్చుటయే

తడవుగ విసవిస నడచుచు నౌకరులు పనులు చక్కఁబెట్టు చున్నారు.

అటుప్రక్క నున్నతాసనము నధిష్ఠించి యున్నది అహ్మదునగరపు సుల్తాను.

అది కళ్యాణమంటపము. కళకళలాడుచున్నది. వరుని పైపు బలగమొక వైపు; వధువువైపుబలగ మొకచక్కి; చుట్టును హితులు, పురోహితులు, చుట్టపక్కములు, చూడ వచ్చినవారు. మంటపముపై నునుసిగ్గుదొంతరలతో, క్రొత్త బట్టలతో, క్రొంగ్రొత్తరుచు లీను వధూవరులు - జిజీబాయి షాజీలు.

మంగళ వాద్యములు మ్రోఁగుచున్నవి. జలజల నవదంపతులు తలఁబ్రాలు పోసికొనిరి.

"ఆనాఁడు వసంతము చల్లితిని జ్ఞాపకమున్నదా?" అని మెల్లగ షాజీ నవ్వెను.

"నిండుగ పోసినది నేనుగదా!" అని బదులాడిన జిజీ బాయి నవ్వు షాజీనవ్వుతో జతయయ్యెను!!

